# ★ మనభూమి

## ★ మన ఆహారం



రచన:

జి. సి. కొండయ్య

# మన భూమి
# మన ఆహారం

రచన:

జి. సి. కొండయ్య



అరుణరేఖా పబ్లికేషన్సు
నెల్లూరు

# అంకితం



ఆహారం కొరకు అష్టకష్టాలకులోనై
అశువుల బాసిన సోదర
మానవులకు

# ఒక మాట

ఆహార కొరత పరిష్కారానికిగాని, భూసమస్య పరిష్కార మార్గంగాగానీ, ఈ గ్రంథాన్ని వ్రాయలేదు.

దేశంలో తీవ్రరూపం ధరించుతున్న ఆహార సమస్య, దానికి మూలమైన భూసమస్యపై, ప్రభుత్వ రిపోర్టులు, ప్రముఖుల పుస్తకాలు- వివిధ రాజకీయపార్టీలు ఎన్నికలలో ప్రకటించిన పరిష్కార మార్గాలు తరచి చూచినప్పుడు, అసలు సమస్య ఎట్టిదో- అది ఏరూపం తీసుకొంటుంది- దీనికి కారణాలు, మొదలైనవి గ్రహించను. అవసరమైన లెక్కలతో యీ విషయాన్ని ఆంధ్ర ప్రజల ముందుంచాలనే అభిప్రాయం నాకేర్పడింది. దాని ఫలితమే నా యీ చిన్న పుస్తకం. నాకీ గ్రంధ రచనకు, నేనిందులో వుదరించినవే కాక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల స్టాటిస్టిక్సు అనేకం తోడ్పడ్డాయి. యీ ప్రయత్నానికి మద్రాసు శాసనసభ లైబ్రరీ మేనేజరు, అడిగినప్పుడంతా- అవసరమైన పుస్తకాన్ని ఇచ్చి తోడ్పడ్డంకు వారికి నేను కృతజ్ఞడను.

నేనీ పుస్తకాన్ని పూర్తిచేసిన తర్వాత ఆంధ్రరాష్ట్రం విడబడడం జరిగింది. అందువల్ల ఆంధ్రరాష్ట్రంపై ప్రత్యేకించి వ్రాయుటకు అవసరమైన భోగట్టా సేకరించను అవకాశం లభించలేదు.

ఆయినప్పటికీ, ఆంధ్రరాష్ట్రంలో భూసమస్య, ఆహారకొరత- అనారోగ్యం, నిరుద్యోగం, అఖిలభారత సమస్యకు భిన్నమయిందేమీకాదు కావున- గ్రంథంలోకనుపరచిన వివరాలు మనరాష్ట్రానికికూడావర్తిస్తాయి.

అంతేగాకుండా- ఆంధ్రరాష్ట్రంపై ఈమధ్యనే లభించిన కొద్దిపాటి లెక్కలు కొన్ని ప్రత్యేకంగా గ్రంధం ఆకరులో " ఆంధ్రరాష్ట్రం "అన్న హెడ్డింగు క్రింద ఇస్తున్నాను. అది కొంతవరకు ఆంధ్రపరిస్థితిని అర్ధం చేసుకొన తోడ్పడుతుందని ఆశిస్తాను.

నెల్లూరు
10-9-53

జి. సి. కొండయ్యా.
M. L. A.

# ప్రకృతిలో మన స్థానం

"ప్రకృతి యొక్క విలువైన పారితోషికాలు, ఆనందదాయకమైన అభివృద్ధికి అవకాశాలు కలిగివున్న, ఒక గొప్ప భూభాగంలో విధి ఇండియాను సృష్టించింది. పరిపూర్ణమయిన ప్రకృతి కావలసినంత పంటను ఇచ్చింది. బ్రతుకు దెరువుకొరకు ప్రాణి పోరాడవలసిన అవసరం భారత దేశానికి దాపురించ లేదు" అని వర్ణించారు మన దేశాన్ని గురించి నేటిమన ప్రభుత్వ ఉపాధ్యక్షులు సర్. రాధాక్రిష్ణన్ గారు ("ఇండియన్ ఫిలాసఫీ" అన్న గ్రంధం పీఠికలో)

నిజమే! మన దేశం ప్రకృతిశోభకు, సంపదకు చక్కని నిలయం. విశ్వంలో వెల్లివిరిసిన వివిధ వాతావరణ అనుకూ

లాలు, గొప్ప దండకారణ్యాలు, జీవనదులు, విస్తారమైన, చేవగలిగినభూములు, కావలసినంత ఖనిజసంపద, క్రిక్కిరిసిన జనాభా, మన భూభాగంలో ఏదికొరత అందాం! సృష్టిచలవ వల్ల మనకు అన్నీ చక్కగా అమరివున్నాయి.

ప్రపంచ భూవిస్తీర్ణంలో మనదేశం 3.08 వ వంతు, ప్రపంచ జనాభాలో 17.93 వ, వంతు. ప్రపంచంలో చిక్కగా మానవులు నివసించే ప్రదేశాలలో మనదేశం ఒకటి. ప్రపంచంలో సగటున ఒకస్క్వేయరుకిలో మీటర్ భూమిలో 15.9 మంది నివశిస్తూంటే, మనదేశంలో ఒక స్క్వేయర్ కిలో మీటర్ భూమిలో 95 మంది నివశిస్తున్నారు. అంటే-భూమి యొక్క మూడవవంతులో పద్దెనిమిదవవంతు జనాభా మనదేశంలోవుంది. ప్రపంచజనాభా 240 కోట్లయితే, మనదేశంలోనే, 40 కోట్లమంది వున్నారు. ప్రపంచములో సగటున నిమిషానికి 3206 మంది జన్మిస్తే, మనదేశంలోనే నిమిషానికి 9 మంది పుట్టుతున్నారు. ప్రపంచములో 250 కోట్ల ఎకరాలు సాగులో వుంటే. మనదేశంలోనే 31 కోట్ల ఎకరాలకుపైగా సాగులో వుంది. ప్రపంచములో 20 కోట్ల ఎకరములు నీటిసాగుక్రింద వుంటే, మనదేశంలో 4 కోట్ల ఎకరములకు పైబడి నీటిసాగు క్రిందవుంది. ప్రపంచ పశుసంఖ్యలో మూడవవంతు మనదేశంలోనేవుంది, అంటే 25 కోట్లా 50 లక్షల పశువులు మనకున్నాయి. చముదుగింజలు, టీ, చెరుకు వుత్పత్తిలో మనదేశానిదే అగ్రస్థానం. పొగాకు వుత్పత్తిలో మనదేశం రెండవది.

మనకున్న నదీజలాలశక్తితో 4 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని వుత్పత్తి చేయవచ్చు. మనకున్న సాగుబడిభూమిఅంతా 80 వంతులు ఆహార ధాన్యోత్పత్తి క్రిందే వుంది.

ఒక దేశ సంపదకు ఔన్నత్యానికి అవసరమైన ప్రకృతి లక్షణాలు-అంటే-సువిశాలమైన, సారవంతమైన భూకంద్రికలు స్నేహపూర్వక వాతావరణం, దట్టమైన దండకారణ్య రక్షణ, నదీమతల్లుల పొంగి పొర్లి-పచేనుగలిగిన వుదార వరుణదేవుడు, వీటన్నిటి చలవతో విలసిల్లిన పశుకోటి, అన్నిటినీ కదిలించ గలిగిన గొప్ప మానవశక్తి మన దేశాన్ని అలంకరించాయి.

అయితే, ఇట్టి మన మాతృభూమిలో తిండిదొరకక మానవులు తపించి పోతారని ఎవరు వూహించి వుండగలరు?

## జనాభా-భూమి-వుత్పత్తి

ప్రకృతిసంపద ఎంతవున్నా దాన్ని వినియోగించుకోవ లేనప్పుడు అట్టిది వుండీ లేనట్లేగదా. మన దేశమే కాదు, లోకంలో అన్ని దేశాలూ ఎదిరించిన, నేటికింకా చాలా దేశాలు ఎదిరిస్తున్న తిండిసమస్య మన దేశంలో అంత్యరూపం ధరించనుంది పెరుగుతున్న జనాభా, తరుగుతున్న మన వ్యవసాయమును పరిశీలిస్తే-ఈ గమనం ఇంకాకొంతకాలం ఇట్లాగే కొనసాగితే ఇది భయంకర పరిణామానికి దేశాన్ని గురిచేస్తుందనే విషయం ఎవరికయినా అర్థమవుతుంది.

1911 వ సంవత్సరములో 22 కోట్లా 6 లక్షలున్న మన జనాభా 1941 నాటికి 29 కోట్లా 50 లక్షలకు దాటిపోయింది గత 50 సంవత్సరాలలో ఇండియన్ యూనియన్ జనాభా లెక్కల ప్రత్యేకించిచూస్తే 50 వంతులు పెరిగింది. 23 కోట్లా 55 లక్షలనుండి 35 కోట్లా 69 లక్షలకు పెరిగిపోయింది. ఇట్లా వేడికి పిగిలినట్లు పెరుగుతున్న మన దేశ జనాభాను చూచి నప్పుడు-ఇట్టి చిక్కుసమస్య ఇంకే దేశానికి లేదేమో-మనతిండి కొరతకు బహుశా, ఇదే కారణమేమోననిపించవచ్చు. కాని నిజం తద్వ్యతిరేకమయింది. నిజానికి జనాభా పెరుగుదలలో మన దేశం వెనుకబడేవుంది. 17 వ శతాబ్దంలో మన దేశ జనాభా 10 కోట్లుమాత్రమే. 1872 వ సంవత్సరానికి 20 కోట్లా 60 లక్షలు. 1930 నాటికి 30 వంతులు పెరిగింది. ఇదే కాలంలో అంటే 1870 నుండి 1930 నాటికి, ఇంగ్లాండు జనాభా 77 వంతులు, జపాన్ 113, రష్యా 115 వంతులు పెరిగింది. (లీగ్ ఆప్‌నేషన్సు లెక్కలు) అందువల్ల జనాభా పెరుగుదల ఆహారకొరతకు కారణం అనటం అవాస్తవికం. పెరుగుతున్న జనాభాకు తగిన ఆహారాన్ని వుత్పన్నం చేసుకొనలేకపోవటం అన్నదే అసలుసమస్య.

జనాభా పెరుగుదలతో పోల్చితే మనవ్యవసాయం ఎంత తిరోగమించిందో తెలుస్తుంది. 1901 నుండి 1941 మధ్య మన జనాభా 34 వంతులు పెరిగితే-ఇదేకాలంలో మన వ్యవసాయం ఐదువంతులు మాత్రమే పెరిగింది. రెండవకాకు

భూమిని కలిపి లెక్కించినా 10 వంతే పెరిగింది. అంటే జనాభా పోలికతో చూస్తే మన వ్యవసాయం 24 వంతులు పడిపోయింది. 1911 లో తల 1-కి 90 సెంట్లకు పైబడివుండిన వ్యవసాయక భూమి 1921 లో 88 సెంట్లు 1931 కి 82 సెంట్లకుదిగి 1941 కి 67 సెంట్లకు పడిపోయింది. ఇప్పుడది అర్థఎకరాకు కొద్దిగామించుతుంది. స్థిరమైన నీటిసాగులోవున్న భూమిని లెక్కిస్తే తల 1-కి 18 సెంట్లకు లోపలే వుంటుంది. (గవర్నమెంట్ ఆఫ్ఇండియా-ల్యాండ్-అండ్-ఇన్స్టిట్యూట్‌స్టిక్సు నుండి లెక్కలు)

జనాభాకు తగినట్లు భూవిస్తీర్ణం పెరగకపోయినా వున్న భూమిలో ఆధునికపద్ధతుల ననుసరించి పంటల నధికము చేయుకున్నా-వున్నదివున్నట్లయినా నిలుపుకోనలేకపోయ్యాము. 1941 వ. సంవత్సరంనాటికే మన వరిపంట ఎకరానికి 83 పౌన్లు తగ్గిపోయింది. 1921 నుండి 1941కి ఆహారధాన్యాలు సగటున అన్నిరకాలూకలిపి తల 1 కి 480 పౌన్లనుండి 327 పౌన్లకు పడిపోయినవి. 1941 తర్వాత మనఆహారకొరత మరింత అధ్వాన్నమయికూర్చుంది. అధికోత్పత్తి అని, అభ్యుదయ ప్రణాళికలని, పంచవర్ష ప్లానులని ఎన్నివిన్నా - ఆహారకొరతమాత్రం అధికమవడంతప్ప ఆగిపోవడం జరగలేదు. 1941 నుండి 1951 లోపల ఎకరం 1 కి 619 పౌన్లనుండి 565 పౌన్లకు మనఫలితం పడిపోయింది అధికంగాపండిందీ అనుకొన్న 1943-44 సంవత్సరంలో 66. 5మిలియన్లటన్నులకు దేశంమొత్తంపై అన్నిరకాలఆహారధాన్యం దాటలేదు. (మిలియన్ అంటే 10 లక్షలు-) అప్పట్నుండి

ఈనాటికీ ఇంకా మన ధాన్యోత్పత్తి దిగజారుతూనేవుంది.

1950 వ సంవత్సరానికే అధికంగా పండించదలచుకొన్న మన ప్రభుత్వ-అధికవుత్పత్తి అంచనాలనుకలిపి 187 మిలియన్ల టన్నులు పండించ తీర్మానిస్తే- ఇంతకూ అధికోత్పత్తి అనుకొన్నది లక్షా డెబ్బదినాలుగు వేల టన్నులుమాత్రమే వచ్చింది. అందువల్ల అధిక ధరలకు- అనారోగ్యకరమైన విదేశ ధాన్యాదుల దిగుమతులపై ఆధారపడవలసివచ్చింది. 1952 వ సం. మొత్తం పంట అంచనాలు సగటున సంతృప్తికరంగా వున్నట్లు ప్రకటించిన కేంద్రప్రభుత్వం, యీ సంవత్సర దిగుమతికోటా 27 లక్షల టన్నులకు నిర్ణయించారు. (మినిష్టరీ ఆఫ్ ఫుడ్ ప్రొడక్షన్ 1952 రివ్యూ నుండి లెక్కలు)

1940-వ సం॥రంలో నికరపుసాగు ఎంత వుండిందో- దాదాపు ఇప్పుడూ అంతేవుంది. (అధికోత్పత్తి క్రింద సాగయిన భూమి లెక్కల్లోకివచ్చేంత గొప్పదేమీకాదు. అదయినా స్థిరమైనసాగు కాదు) అల్లాగే ఫలితంకూడాను 1818 లో 2 కోట్ల 90 లక్షల ఎకరములు మన దేశంలో నీటిక్రింద సాగయ్యేది. 1903 నాటికి ఇది 4 కోట్ల 40 లక్షల ఎకరాలకు పెరిగింది. అప్పట్నుండి అంటే 50 సంవత్సరాలలో నీటిసాగుగా పెరిగింది ఏమీలేదు. దేశం మొత్తంమీద వ్యవసాయంలో 18 వ శతాబ్దంలో 4 వ వంతు నీటిసాగుక్రిందవుంటే—యీ దామాషా ఇప్పుడూ అక్కడేవుంది,

## ఇండియన్ యూనియన్ ఆహారధాన్యాల వుత్పత్తి

వేల - 000 టన్నులలో (లెక్కకువచ్చిన పంట లెక్కలు)

| | |
|---|---|
| 1936-39 | 43,762 |
| 1939-40 | 42,764 |
| 1940-41 | 41,891 |
| 1941-42 | 40,634 |
| 1942-43 | 44,224 |
| 1943-44 | 45,441 |
| 1944-45 | 46,093 |
| 1945-46 | 40,768 |
| 1946-47 | 42,068 |
| 1947-48 | 44,393 |
| 1948-49 | 44,260 |
| 1949-50 | 45,841 |

(1950 ఫుడ్ స్టాటిస్టిక్సు - మినిస్ట్రీ ఆఫ్ అగ్రికల్చర్ - గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారి లెక్కలనుండి).

యీ లెక్కలప్రకారంకూడా అధికోత్పత్తి క్రిందనున్న అధనపుసాగును కలుపుకొని లెక్కించినా 1944-45 వుత్పత్తి కన్నా తగ్గిపోయిందని తెలుస్తూంది.

దిగజారుతున్న మన వ్యవసాయానికి మూలమేమిటో పరిశీలించేదానికిమారుగా— కొంత కాలమునకు భూమి నిస్సారమయితే ఎవరేమి చేయగలరనే చవకబారు మాటలతో

సంతృప్తి పడడం కూడా జరుగుతూంది. జనాభా అధికం కావడం యీ చిక్కుకంతా కారణమనేది ఎంత అవాస్తవికమో — యీ చవకబారు సలహా కూడా అట్లాంటిదే. మన దేశ వుత్పత్తిని విదేశాలతో పోల్చితే మనం, మన కనీస వుత్పత్తిస్థాయిని కూడా నిలుపుకోనలేని స్థితిలో వున్నామని స్పష్టమవుతుంది.

## విదేశాలతో పోల్చితే మన పంట

ఒక ఎకరములో పౌన్లలెక్కను — వరి పంట

| | 1909-13 | 1926-27 | 1931-32 | 1936-37 | 1938-39 |
|---|---|---|---|---|---|
| ఇండియా | 982 | 851 | 829 | 826 | 728 |
| అమెరికా | 1000 | 1333 | 1405 | 1469 | 1471 |
| ఇటలీ | 1952 | 2797 | 2839 | 3258 | 2903 |
| స్పెయిన్ | 2969 | 3749 | 37[illegible]9 | — | — |
| ఈజిప్టు | 2119 | 1799 | 2082 | 2081 | 2153 |
| జపాన్ | 1827 | 2124 | 2053 | 2305 | 2276 |

గోధుమ బ్రిటన్‌లో ఎకరం 1కి 1985 పౌన్లకు పెరిగితే ఇండియాలో 724 పౌన్లకు పడిపోయింది. ఇల్లాగే ఇతరపంటలు పడిపోయాయి. (బరన్స్ "టెక్నలాజికల్ పాసిబులిటీస్ ఇన్ ఇండియా ఫర్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంటు" నుండి లెక్కలు)

యిట్లా భూవిస్తీర్ణం పెరగలేదు, సరికదా — వున్న వ్యవసాయంలో పంట అతిహీయంగా పడిపోతూంది.

## ఇతర ఆహారపదార్థాలు

ఆహారమునకు ప్రధానమైన ధాన్యోత్పత్తిపడిపోయినా, ఇతర ఆహారపదార్థాలనయినా అధికంగా వుత్పత్తి చేసుకోన గలిగామా అంటే.—అదీ లేకపోగా—అవికూడా తిరుగుముఖం పట్టాయి.

కాయకూరలు పండించను మన దేశంలో 7 లక్షల ఎకరములు సేద్యంచేసేవారు. యీ విస్తీర్ణంకూడా క్రమేపీ తగ్గిపోవడమే కాకుండా, పంటపరిప్రమాణం బాగా పడిపోతూవుంది. ఈ ఏడు లక్షల ఎకరములలో ప్రధానమైన వుర్లగడ్డ వుత్పత్తి క్రింద 5 లక్షల ఎకరములువుంది. కాని మన దేశంలో త 1 కి 9 పౌన్లకుమించి వుర్లగడ్డ వుత్పత్తి కావడంలేదు. బహుశా ప్రపంచంలో ఏ దేశంలోకూడా ఇంత తక్కువ ప్రమాణం లేదేమో! యూరోపియన్ దేశాలలో ఏనిస్సారమైన దేశంతో పోల్చినా అచ్చట త 1 కి 141 పౌనులనుండి 214 పౌనుల వరకూ వుత్పత్తిఅవుతూంది, మొత్తం ఏడులక్షల ఎకరముల కాయకూరల వుత్పతిఎప్పుడూ 90 లక్షల టన్నులకు మన దేశంలో మించలేదు

పండ్లవుత్పతికూడా ఇట్లాగేపడిపోయింది. 45 లక్షలఎకరములలో సాగుతు-డిన పండ్లతోటల పెంపకం ఇప్పుడు 25 లక్షల ఎకరాలకు దిగబడిపోయింది. సగటు వుత్పత్తి ఒకకోటి టన్నులకు మించదు. యీ వుత్పత్తిని సగటునవున్న జనాభాకు పంచి లెక్కిస్తే త 1 కి ఒక ఔన్సు వస్తుంది.

పాలవుత్పత్తి ప్రపంచ పశుసంపదలో 28.5 వంతులున్న మన పశుకోటిని తలచుకొన్నప్పుడు— ఏదిఎట్లావున్నా మనకు పాడికి కొరతపడవలసిన అగత్యం వుండదేమో అనిపిస్తుంది. కాని ప్రపంచ పాలవుత్పత్తిలో మనది 12 వ వంతుమాత్రమే. 25 కోట్లా 50 లక్షల పశువులున్న మనదేశం ఎన్నిపాలయితే వుత్పత్తిచేస్తూందో 2½ కోటి పశువులుమాత్రమేవున్న జర్మనీ అన్నివుత్పత్తిచేస్తూంది. 1941 వ సం॥ మనపాలవుత్పత్తి 62.9 కోట్ల మణుగులు—అంటే 2 కోట్లా 31 లక్షల టన్నులు. ఈ లెక్కను రోజుకు 6.42 ఔన్సులు వస్తుంది. 27 వంతులకుపైగా పెరిగిన మన జనాభాతో పాలవుత్పత్తిపోల్చి 1921 నుంచి అధికంగా తగ్గిపోతూన్న మన పాలవుత్పత్తిని లెక్కిస్తే ఇప్పుడు తల 1 కి 4 ఔన్సులే వస్తాయి. పెరుతున్న జనాభా దామాషాకు 22 వంతులు పడిపోయింది పాలవుత్పత్తి

కాని ఇదేకాలంలో ప్రపంచ పాలవుత్పత్తి పెరిగింది. కెనడాలో రోజుకు తల 1 కి 57 ఔన్సులు, న్యూజిలాండులో 56, బ్రిటన్‌లో 41 ఔన్సులవరకూ పెరిగింది పాల పరిమాణం. 4కోట్లా 90 లక్షల ఆవులు, 2 కోట్లా 10 లక్షల బర్రెలు, 6 కోట్లా 20 లక్షల మేకలూవున్న మనదేశంలో పాలవుత్పత్తి విదేశాల దామాషాకు పెరిగితే ఇప్పుడున్న వుత్పత్తికి కనీసం మూడువంతులు అధికంకాగలదు. మనదేశంలో సగటున ఆవు సం॥ 1 కి 487 పౌన్ల పాలుయిస్తే, గేదె 1329 పౌన్ల పాలు యిస్తూంది. కాని డెన్మార్కులో ఆవు 7005 పౌన్లు, ఆస్ట్రే

యాలో 3463, ఈజిప్టులో 2663 పౌన్లు యిస్తున్నాయి. ఆ దేశాలలో గేదె మన గేదెకు నాలుగువంతులు అధికంగా పాలిస్తుంది (గవర్నమెంటు ఆఫ్ ఇండియావారి అగ్రికల్చరల్ మార్కెటింగ్ రిపోర్టు, డాక్టర్ రైట్‌గారి "కాటిల్ వెల్త్ ఇన్ ఇండియా" అన్న గ్రంథం నుండి లెక్కలు)

మన చేపల పెంపకం నిజానికి చెప్పుకోతగ్గ విషయం కాదు. సం॥ 1 కి సగటు చేపవుత్పత్తి 1 కోటి 79 లక్షల మణుగులు—అంటే 6 లక్షలా 59 వేల టన్నులు. ఈ వుత్పత్తి స. 1 కి మనిషికి మూడూ - నాలుగు పౌన్ల మధ్యనవస్తుంది. ప్రపంచంలో అన్ని దేశాలలోనూ చేపల వుత్పత్తి అధికమయింది. యుద్ధానికిముందే బ్రిటన్‌లో త 1 కి చేపలవుత్పత్తి 40 పౌన్లకువుంది. ఇక మాంసం - గ్రుడ్లవుత్పత్తి మన దేశంలో పేరుకుమాత్రమేవుంది. (గవర్నమెంట్ ఆఫ్ ఇండియావారి మార్కెటింగ్ సర్వే రిపోర్టునుంచి లెక్కలు)

మన దేశం చక్కెర వుత్పత్తిలో ప్రధానస్థానం ఆక్రమిస్తుంది. కాని యుద్ధకాలవత్తిడిలో ఇతర దేశాల పరిమాణం కూడా మన దేశంలో వినియోగించరు. యుద్ధకాలంలో సహితం బ్రిటన్‌లో సంవత్సరానికి త 1 కి 106 పౌన్లు వినియోగిస్తే అమెరికాలో 97 పౌన్లు విని[illegible] చారు. ఇప్పుడు వారి పరిమాణం యెంతో పెరిగిపోయింది. కాని మన దేశంలో నేటి చక్కెరవినియోగం బెల్లంతో కలిపి సంవత్సరానికి త 1 కి 30 పౌన్లుమాత్రమే అందుతూ ది. ఇట్లా వరుసన ధాన్యం మొదలు—ఇతర ఆహారపదార్థాలు అన్నీ దిగబడిపోతున్నాయి.

# మన కొరతలు

35 కోట్ల ఇండియన్ యూనియన్ ప్రజలకు కనీసం 6 కోట్ల టన్నులయినా ఆహారధాన్యాలు కావలసివుంటుందని, అయితే నేటి మన దేశం వుత్పత్తి చక్కెరతో కలిపి 5 కోట్లా 50 లక్షల టన్నులుమాత్రమేవుందని 1948 లో నేషనల్ ప్లానింగు కమిటీవారు అంచనావేశారు. 1951 వ సం. సెన్సస్ ప్రకారం ఇండియన్ యూనియన్ జనాభా 35 కోట్లా 67 లక్షలు. యీ జనాభాలెక్కనననుసరించి 1940వ సంవత్సరంలో మన వుత్పత్తినిపోల్చి లెక్కిస్తే రోజుకు త 1 కి అన్ని రకాల ధాన్యాలూకలసి 13.71 ఔన్సులు వస్తుంది. యీ రేషన్‌ను నిలబెట్టనయినా 1951 వ జనాభాకు 6 కోట్లా 70 లక్షల టన్నులు కావలసివుంది. (13 ఔన్సుల రేషన్‌కూడా 30 లక్షల టన్నుల విదేశ ఆహారధాన్యాల దిగుమతులతోకలపి) కాని కేంద్రప్రభుత్వ ఆరోగ్యకమిటీ సలహాప్రకారం కనీసం త 1 కి 14 ఔన్సులయినా కావాలన్నారు - అంటే అర్థం వీరి లెక్కలప్రకారం 7 కోట్లా 80 లక్షల టన్నులు ఆహారధాన్యాలే కావలసి వుంటుంది. కాని యీమధ్యనే వెలువడిన ప్రభుత్వ లెక్కలప్రకారమే 13 ఔన్సుల రేషన్‌కే 45 లక్షలటన్నులు తరుగుతేలింది.

మన ప్రభుత్వ కరువు కమిషన్ లెక్కలు, ప్రముఖ ఆహారకొరత పరిశీలకులైన డి. ఘోష్. లెహీంల అంచనాలు (ఫ్రిక్వెన్సీ ఆఫ్ ఫేమిన్స్ ఇన్ ఇండియా అన్న గ్రంథంలో) మన దేశ కొరతలను యీ క్రిందివిధంగా ఎరుకపరచారు.

## లక్షలటన్నులలో

| | కావలసినది | ఉత్పత్తిఅయ్యేది | కొరత |
|---|---|---|---|
| ధాన్యం | 599.2 | 575.1 | 4.2 |
| కాయకూరలు | 261.4 | 89.0 | 66 |
| పాలు | 196.6 | 76.0 | 61.3 |
| చమురు - నెయ్యి | 65.3 | 22.8 | 65.1 |
| చేప-మాంసం-గ్రుడ్లు | 98.0 | 12.0 | 87.8 |

ఈలెక్కలు పదిసంవత్సరాల క్రిందటివయినా - ఇప్పుడింకా మనకొరతలు పెరుగుతున్నాయేకాని, తగ్గిందేమీలేదు. ధాన్యాన్ని ప్రత్యేకంగా తీసుకొనిచూచినా ఆనాడు 25 లక్షల టన్నులు—అంటే 4.2 కొరతవుంటే - అది నేటి ప్రభుత్వ లెక్కలప్రకారమే 45 లక్షల టన్నులు—అంటే 7.6 వంతుల కొరతయేర్పడింది.

ఇంతపెద్ద ఆహారకొరతను పూడ్చను, అందుకయినా అట్లా ఏదోఒక సంవత్సరం అనావృష్టియో - అధికవర్షాలో వుత్పన్నంచేసిన లోటుకాకుండా - స్థిరపడి - నిత్యం పెరిగిపోతున్న యీలోటును భర్తీచేయను మనప్రభుత్వం అనుసరించిన మార్గం ఏమిటనేది అతిముఖ్యమైన విషయం. ఎందుకంటే - ఆహారధాన్యాలలోటు ప్రభుత్వ రాబడిని కాజేసి ప్రజోపయోగ్యమైన పనులకు పెద్దఆటంకం కలిగిస్తుంది ఆవిధంగా ఆహారధాన్యాలలోటు మొత్తం దేశాభ్యుదయము

నకే అడ్డంకిగా తయారవుతుంది. కాని మనప్రభుత్వం సరిగ్గా యిట్టిమార్గాన్నే చేబట్టింది, 1943 నుండి 1950 వ సంవత్సరానికే, విదేశ ధాన్యాదుల దిగుమతులకై ప్రభుత్వం ఐదు వందల కోట్ల రూపాయల వెచ్చించింది. ఇదేకాలంలో మన వ్యవసాయాన్ని అభివృద్ధిచేసి, తద్వారా అధికోత్పత్తి - అందరికీ పని, తిండినిఅందించే విధానాన్ని అనుసరించి - మన కొరతల శాశ్వితంగా అరికట్టేపద్ధతిని చేబట్టలేదు. ఫలితం మరింత అధనంగా విదేశ ధాన్యాలపై ఆధారపడి - ఆహారధాన్యాల కొరతకుతోడు, దేశీయ ఖజానాను ఖాళీచేయడం జరిగిపోతుంది.

## విదేశ ధాన్యపు దిగుమతులు

| సంవత్సరం | (000 టన్నులలో) | ఖరీదు కోట్ల రూపాయలలో |
|---|---|---|
| 1943-44 | 326 | 8.44 |
| 1944-45 | 726 | 15.76 |
| 45-46 | 2249 | 76.11 |
| 46-47 | 2334 | 93.99 |
| 47-48 | 2841 | 129.72 |
| 48-49 | 3706 | 144.60 |
| 49-50 | 2125 | 79.90 |

1950 నాటికి మన ఆహారధాన్యాదుల కొరత ధాన్యరూపంలోనూ - ధనరూపంలోకూడా పైలెక్కలు విశదీకరిస్తు

ర్నాయి. 1950 తో మనకొరత ఆగలేదు. సరిగదా 1950 లో 21 లక్షలా 25 వేల టన్నులధాన్యం 79 కోట్లా 90 లక్షల రూపాయలకు దిగుమతిచేస్తే 1952 లో 38 లక్షలా 60 వేల టన్నులు 210 కోట్ల రూపాయలకు దించారు. 1953 దిగుమతి కోటా 27 లక్షల టన్నులు. ఇట్లా ఇప్పటికే దాదాపు వెయ్యి కోట్ల రూపాయలు విదేశ దిగుమతులపై వ్యయమైపోయింది. (మినిష్టరీ ఆఫ్ అగ్రికల్చర్ ఆఫ్ గవర్నమెంటు ఆఫ్ ఇండియా రిపోర్టు లెక్క-లు)

## తిండికొరతనుండి తీరని కరువులు

చక్కగాపండింది అనుకొన్నా, మనకొరత ఎట్లా సంవత్సరం తర్వాత సంవత్సరం పెరిగిపోతూందో, ప్రభుత్వలెక్కలే చాటుతున్నవి. తిండిదొరకక, నిత్యం మన ప్రజలు అనుభవించే ఘోరకష్టాలు మనం కండ్లారా చూస్తూనేవున్నాము. వాతావరణ వడిదుడుకులు వుత్పన్నంచేసే అనావృష్టియో - అతివృష్టియో, దేశంలో ఏదోఒకమూల సంభవించిందా యిక ఆ ప్రాంతంలో ఆకలిదేవత వికటాట్టహాసం చేస్తూంది. ముందే కొరతలతో మూలుగుతున్న మన ఆహారపరిస్థితిలో కరువు కాటకములనుండి ప్రజల రక్షించడం దుస్సాధ్యమయిపోయి, లక్షలాది ప్రాణాలు నిలువున రాలిపోవడం మన దేశంలో మామూలయిపోయింది.

భారతదేశపరిస్థితిపై వ్యాఖ్యానిస్తూ "లెటస్ జాయిన్ ది హ్యూమన్ రేస్" అన్న గ్రంథంలో శ్రీ శార్ "నీవు

భారతదేశంలో పుట్టావా...! ఒకసంవత్సరంకన్నా అధికంగా జీవించగలవని నాలుగింట ఒకవంతుకూడా నీకు నమ్మకంలేదు. ఒక వేళ నీవు శైశవంనుండి బయటపడగలిగినా యుక్తవయస్సు చేరుకొనే ఏబదివంతులు అసాధ్యం.

"నీవు నల్లవాడివై - అంటే - భారతదేశంలో జన్మించావా, మలేరియానో, మూలవ్యాధియో, క్షయయో, లేక కుష్టురోగమో, ఏదోఒకటి నిన్ను వెంటాడి, జీవితమంతా కృంగి కృసించను నీకు అనేక అవకాశాలున్నాయి. ఎట్లాగో వీటన్నిటినుండీ నీవు తప్పించుకొన్నావనే అనుకొన్నా, ఆకలిఅనే ఒక ఘోరవ్యాధినుండి నీవు బహుశా బయటపడడం జరగదేమో!

"నీవు భారతదేశంలో పుట్టావా, చెట్లతాలైనా తినడం కొరకు, కరువు కాటకాలు నిన్ను మహాగొప్పగా ప్రోత్సహించుతాయి. కాని ఇట్టి జీవితఆనందాన్ని ఆదేశంలోపొందను నిజానికి నీవు అంతదాకా బ్రతికివుండవేమో" అని వ్రాశాడు.

మన దేశంలో విలయతాండవమాడుచున్న కరువు కాటకాలు పై వాక్యాలలోని వాస్తవాన్ని ప్రస్ఫుటంచేస్తున్నాయి. తిండికొరతనుండి తీరని కరువులతో స్థిరపడిపోయిన మన ఆహారవుత్పత్తివడిదుడుకుల్లో పడ్డప్పుడంతా కోట్లకొలది ప్రాణాలను బలిగొంటుంది.

1911 నుండి 1945 వరకు జరిగినకాలంలో గోధుమపంట 6 సార్లు దెబ్బతినిపోతే, బార్లీ 9 సార్లు, రాగి, సజ్జ 7 సార్లు,

జొన్న 9 సార్లు, పప్పుధాన్యాలు 10 సార్లు దెబ్బతిన్నాయి. మన ఆహారపులోటు, దానితో మామూలుగా మనంపడేబాధ అటుంచి, ఏసంవత్సరం, ఎచ్చట ఏప్రధానపంట దెబ్బతినిపో యిందో ఆసంవత్సరం అధికంగా జనం చనిపోవడం పరిపాటి అయింది. 1931 వ సం॥లో మన ధాన్యోత్పత్తి 501 లక్షల టన్నులనుండి 1932 కు 496 లక్షల టన్నులకు పడిపోయింది. దీనిననుసరించి మరణసంఖ్యను పరిశీలించితే 1931 లో 58.1 లక్షలమంది చనిపోతే, 1932 లో 66.2 లక్షలు మరణిం చారు. 1938 లో ధాన్యోత్పత్తి 433 లక్షల టన్నులకు పడి పోయింది. చావులు యీ సంవత్సరంలో 66.9 లక్షలకు పెరి గాయి. మన జనన మరణ రిజిస్టర్లు పరిశీలిస్తే ఒక్కొక సంవ త్సరం అధికంగా లక్షలాది చనిపోయివుంటారు. ఏసంవత్సర మైతే మన ధాన్యోత్పత్తి సగటుప్రమాణంకూడా నిలబెట్టుకో లేదో - ఆసంవత్సరం లక్షలాది అధికంగా చనిపోతున్నారు.

19 వ శతాబ్ద ప్రారంభంనుండి 70 సంవత్సరాలు భారతదేశం కరువులకు ప్రసిద్ధిచెందింది. ఆ డెబ్బది సంవత్స రాలలోపల 13 కరువులువచ్చి అందులో 64 లక్షలు చనిపో య్యారు. కొంతకాలం ఇక కరువులురావేమో అనిపించేలా నాలుగేండ్లపాటు నెమ్మదిగా నడిచింది. కాని తిరిగి 19 వ శతాబ్ద ఆఖరుపాదం అతిఘోరమైన కాటకాలకు గురయింది. ఇరువది సంవత్సరాలలో 18 కరువులు, 2 కోట్లా 60 లక్షల మంది హతమారిపోవడం, సంభవించింది.

గతంగతః అని మరచిపోను ప్రయత్నిద్దామనుకొన్నా, ఆధునిక యుగమనిపించుకొంటున్న ఇరువదవ శతాబ్దం, కరువు రాక్షసి కాలిగజ్జలశబ్దంతో ప్రారంభమయింది. ఆధునికయుగ ప్రారంభమునకు భారతదేశంయిచ్చే బలిదానం గాబోలు, 1901 వ సంవత్సరంలో వచ్చిన కరువు 10 లక్షల ప్రాణాలను హరించింది.

తర్వాత కొంతకాలం ప్రశాంతంగా నెట్టుకపోయింది. దారితెన్నులులేని దౌర్భాగ్యదేశంకాబట్టి, ఒకమూలనుండి మరొకమూలకు తిండిఅందించే రహదారి సౌకర్యాలు శూన్యం కాబట్టి కరువు పిశాచి కరాళనృత్యం చేయగలిగిందని, అందువల్ల ఇరువదవ శతాబ్దంలో రైలు—రోడ్డు—రహదారి సౌకర్యాలు విరివిగా పరచివేశారు. కావున యిక ఇండియాలో "కూడులేక కుక్కకూడా చనిపోదు" అన్న సామెతకూడా వాడుకలోకివచ్చింది. కాని 1943 వచ్చేసరికి వంగరాష్ట్రం తిండికొరకై తపించిపోయింది మూడుమాసాలలో 30 లక్షలు మృత్యువువాత పడిపోయ్యారు. ఆ నాటినుండి ఈ నాటి వరకూ పండినా- ఎండినా- కరువు పరవళ్ళు తొక్కుతూనే వుంది. మలబారు, రాయలసీమ, రాజస్థాన్‌లాంటి ప్రాంతములే గాకుండా- దేశంలో ఎప్పుడూ ఏదో ఒక మూలన, తుదకు అధిక పంటల ప్రాంతాలలో సహితం కరువు కదలను నిరాకరించే స్థితికి వచ్చింది.

తిండికొరతనుండి- తీరని కరువుప్రాంతంగా తయారైన

మనదేశ ఆహార వినియోగం. మొత్తం జనాభాను ఒక నిర్వీర్యమయిన జాతిగా మార్చివేస్తూంది. కాలరీల ప్రమాణంలో మన ఆహార కొరతను పరిశీలిస్తే యీ విషయం మరింత బహిర్గతం అవుతుంది. (కాలరీ అంటే ఆహార పటుత్వాన్ని వుష్ణం లెక్కలో కొలిచే ప్రమాణం) కాలరీల ప్రమాణంలో మానవుని అవసరాలు సమీక్షించిన శాస్త్రజ్ఞుల సర్వే ప్రకారం, 150 పౌన్ల బరువువుండే ఒక మామూలు శరీరం బ్రతికివుండను గంటకు 60 నుండి 70 కాలరీలు కావలసివుంటుంది. అంటే ఒక రోజు ఒక ప్రాణి బ్రతికివుండను సగటున 1700 ల కాలరీలు కావలసి వుంటుంది.

కాని డాక్టర్ అక్రాయడ్ లెక్కల ప్రకారం, మన దేశంలో మనిషి ప్రాణంతో వుండను రోజుకు 1500 ల కాలరీలు కనీసం వుంటే చాలునన్నారు. అయితే మనిషి బ్రతికియున్నంత మాత్రం చేతనే అతడికి భుక్తి లభించదుగదా అందువల్ల బ్రతికివుండను అతడు శరీరాన్ని కదిపి కృషిచేయవలసివుంటుంది. బ్రతికివుండనే 1500 కాలరీలు అయితే, కదిపితే ఆ ప్రాణికి మరికొంత కావలసివుంటుంది.

బ్రిటిష్ ఆహార మం[illegible] వర్గ అంచనాల ప్రకారం, కొయ్యపనివానికి రోజుకు 31[illegible] కొలిమిపనివానికి 4260, రాతిపనిలాంటి కఠిన శ్రమకు 5[illegible]00 కాలరీలు కావలసివుంది. యిట్టి లెక్కల భేధాలను సమ[illegible]యించి, అన్నిరకాల శ్రమకు ఒక సగటు రేటు నిర్ణయిస్తూ తి 1-కి రోజుకు 8 గం. నిద్రకు-

గంటకు 65 కాలరీల వంతున 520 కాలరీలు- గంటకు 240 వంతున 8 గం. పనికి 1920- మిగిలిన 8 గం.ల మామూలు నిత్యకృత్యాలకు 1080 కాలరీలు- మొత్తం త. 1-కి రోజుకు 3520 కాలరీలు కావలెనని నిర్ణయించారు. జర్మనీలో యుద్ధ కాలంలో సహితం కూలీవానికి రోజు 1-కి 4000, బెల్జియంలో 3400, అమెరికాలో 3500 ల కాలరీల వంతున రేషన్ ఇచ్చారు. సైనికులకు 4500 ల కాలరీల వరకూ అందించారు.

మన దేశంలో మనిషి బ్రతికివుండను ఎంత తక్కువైతే చాలుతుందో అంతవరకూ తగ్గించి. బొంబెలో వూపిరి ఆడను 1500 కాలరీలయినా కావలెనన్నారుడాక్టర్ అక్రాయడ్ గారు. ఆయన లెక్కలప్రకారమే 8 గం. పనికి 800- 8 గం. నిత్యకృత్యాలకు 300 - కలిపి, సగటున త- 1-కి రోజుకు 2600 ల కాలరీలు కనీసం కావాలన్నారు. డాక్టరుగారి లెక్కలను ప్రపంచంలో, తుదకు మన దేశంలో ఇంకే శాస్త్రజ్ఞుని లెక్కలతో పోల్చినా, పిసినిగొట్టు లెక్కలుగా కనుపిస్తాయి. మన దేశ దౌర్భాగ్యాన్ని, మనిషి బ్రతికి కదలుతూవుండను ఎంత కావలసివుంటుందో- ఆ అవసరాన్ని దృష్టిలోవుంచుకొని కనీస కాలరీల పరిమాణమునకు ఆహారమును కుదించిచూపారు.

ప్రపంచంలో ఏ ఒకటి రెండు దేశములనో మినహాఇస్తే మన దేశం అన్ని దేశాల ఆహార పరిమాణమునకు ఎంతో

వెనుకబడివుంది. బ్రిటన్‌లో యుద్ధకాలంలో చాలాతక్కువ తిండితో ప్రజలు తంటాలుపడవలసివచ్చిందని గోలచేశారు. కాని ఈ నాటికీ మన ఆహార అనుభవాన్ని యుద్ధకాలపు బ్రిటన్‌తో పోల్చుదామన్నా అందిక దొరకదు.

## మనిషి 1-కి సగటు సంవత్సర ఆహార అనుభవం

| | ఇండియా (పౌన్లలో) | బ్రిటన్ |
|---|---|---|
| ధాన్యాదులు | 413 | 212 |
| వుర్లగడ్డ | 9 | 221 |
| చాప-మాంసం | 7 | 46 |
| పండ్లు - కాయకూరలు | 98 | 203 |
| చక్కెర | 36 | 103 |
| వెన్న | 16 | 25 |
| జున్ను | - | 9 |
| కొవ్వు పదార్థాలు | - | 16 |
| గ్రుడ్లు (సంఖ్యలో) | 6 | 234 |
| నికర పాలు | 53 | 186 |

("ఫీడింగ్ ది పీపుల్ ఇన్ వార్‌టైం" అన్న జె. బి. హోర్సుగారి గ్రంథం నుండి లెక్కలు)

పై లెక్కలు ప్రభుత్వేతర వర్గాలవి కాబట్టి, వుదహరించడం అంతమంచిదికాదనుకొంటే మన కేంద్రప్రభుత్వ అగ్రి

కల్చరల్ రిసర్చి అడ్వయజరీబోర్డు, న్యూట్రిషన్ కమిటీ మొద లైన అధికారవర్గాల అంచనాలను పరిశీలిద్దాం.

## మామూలు ఆహారం

| | |
|---|---|
| మనిషి 1-కి రోజుకు | 14 ఔన్సులు ధాన్యం |
| పప్పు | 3 ఔన్సులు |
| ఆకు - కాయకూర | 4 డిటో |
| దుంపకూర | 3 |
| ఇతర కాయకూరలు | 3 |
| పాలు | 10 |
| చక్కెర-బెల్లం | 2 |
| చమురు - నెయ్యి | 2 |
| చాప - మాంసం | 3 |
| గ్రుడ్లు | 1 |

పై అంచనాలు సామాన్య ఆహారం క్రింద లెక్కించింది మన ప్రభుత్వం. యీ ఆహారమును కాలరీలలోకి మార్చి చూస్తే త 1-కి రోజుకు 2800 ల, కాలరీలు అవుతుంది. యీ లెక్కన సంవత్సరానికి సగటున త 1-కి 10 లక్షల కాలరీలు కావలసివుంటుంది- కేంద్రప్రభుత్వ ఆహార అంచనాల ప్రకా రము, సంవత్సరానికి తునకు 13 కోట్లా 55 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, 10200 ల కోట్ల గుడ్లు- వీటి ననుసరించి యితర పదార్థాలు అనివార్యమవుతాయి.

1951 వ సంవత్సర జనాభాకు యీ లెక్క ప్రకారం కాలరీల అంచనావేస్తే 357. 45 బిలియన్ కాలరీలు సగటున సంవత్సరానికి కావలసివుంది. (బిలియన్ అంటే లక్ష కోట్లు) కాలరీల లెక్కలలో మనకు నేడున్న ఆహారపదార్థాలు 290 బిలియన్ ల కాలరీలు మాత్రమే. అంటే అర్థం- సగటున రోజుకు త. 1-కి 2000 కాలరీలు మాత్రమే మనకు వున్నాయి. యీ లెక్కన మనమంతా సరిసమానంగా ఆహార పదార్థాలు అనుభవిస్తే త. 1-కి రోజుకు 800 ల కాలరీలు కొరత వస్తూంది. అట్లా కావలసిన కనీస పరిమాణానికన్నా మనకు 21. 6 వంతులు తక్కువ ఆహారం లభ్యమవుతూంది. మనకు లభిస్తున్న యీ 2000 కాలరీలలో నే- శరీరం బ్రతికివుండను 1500 కాలరీలు ఖర్చయితే, ఇక మన నిత్యకృత్యాలకు ఎంత వుంటుంటుందో తేటతెల్లమైపోతుంది!

దేశం మొత్తంపైని వుత్పత్తిని, జనాభాను లెక్కించివున్న నిలవలనుబట్టి మన ఆహార అంచనాలు- కొరతలు తేల్చుకొన్నాము- కాని ఆ వున్నమట్టుకైనా అందరికీ ఎప్పుడూ లభించదు. కారణం అందరికీ కొనుగోలు శక్తివుంటేగదా! అదయినా ముట్టుతుంది. యీ విషయాన్ని తెలుసుకొనను మన సగటు జాతీయ ఆదాయాన్నిచూస్తే సరిపోతుంది. మన ఆహారపదార్థాలు ఎంత విచారకరమైన కొరతలో వున్నాయో- మన సగటు నికర జాతీయ ఆదాయంకూడా అంత హాస్యాస్పదంగా తయారయింది డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు

(ప్రముఖ అర్థ శాస్త్రజ్ఞుడు) గారి లెక్కల ప్రకారం త. 1-కి సంవత్సరానికి నికర సగటు రాబడి 1932 లో రూ. 62-0-0 లు అంటే రోజుకు మూడు అణాలు. ఇతర ప్రముఖులు రోజుకు రెండు అణాలే నన్నారు. "ఈస్టరన్ ఎకానమిస్టు" పత్రిక అంచనా ప్రకారం 1949-50 సంవత్సరాల సగటు ఆదాయం 68-7-10 అయితే, "కామర్సు" పత్రిక లెక్కలు 70 రూపాయలు, మద్రాసు ప్రభుత్వ అర్థశాస్త్ర ప్రవీణుడు శ్రీ బి.టి. నటరాజన్ అంచనా ప్రకారం 60-12-0 లు మాత్రమే మన నికర రాబడి. పోనీ అధికంగా చూపించిన లెక్కలనుబట్టి చూచినా, మన నికర ఆదాయం ఎంత హీనస్థితికి పోయిందో బహిర్గతమవుతూంది. ఇక ప్రత్యేకంగా వ్యవసాయ రాబడిని, సగటున వ్యవసాయంపై ఆధారపడే జనాభాకు పంచి లెక్కిస్తే మనిషికి 49 రూపాయలని రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్టాటిస్టిక్సు వారు అంచనా వేశారు.

దీనికి తగినట్లేవుంది. మన పారిశ్రామిక వుత్పత్తి-దాని వినిమయం కూడా.

## ఇండియా పారిశ్రామిక వుత్పత్తి

1000 జనాభాకు ఒక యూనిట్ వంతున

విద్యుచ్ఛక్తి వుత్పత్తి 1000 కు, కిలోవాట్సు —

| ఇండియా | బ్రిటన్ | అమెరికా |
|---|---|---|
| 13 | 1,033 | 2,296 |

| | | | |
|---|---|---|---|
| బొగ్గు వినియోగం టన్నులలో | 51 | 5,333 | 3.473 |
| పెట్రోలు | 7.8 | 327 | 1,333 |
| ఇనుము | 3.8 | 104 | 364 |
| సిమెంటు | 7.2 | 145 | 229 |
| యంత్రాలు పది లక్షల జనాభాకు | 22 | 410 | 309 |
| టెలిఫోన్ | 0.37 | 98 | 261 |

(కొలంబో ప్లాన్ నుండి లెక్కలు)

ఈ విధంగా ఏ రంగంలో చూచినా మన ప్రవృత్తి ఎంత వెనుక పడివున్నదో, అనుభవం అంతకన్నా వెనుకబడిపోయింది.

## దౌర్భాగ్యము కలిగించిన దుష్ఫలితాలు

కనీస తిండికే నానారకాల ఇబ్బందులకులోనయ్యే మన దేశంలో, జీవితంలో ఇతర హంగుల పదిలపరచుకొనడంగాని, పెంపొందించుకొనడంగాని సాధ్యమయ్యేపనిగాదు. అందువల్లే వైద్య- విద్య యితర వసతులు విషయంలోకూడా మనస్థాయి ఆహార కొరతకు ఒక అడుగు ఇంకా వెనుకేవుంది. 1941 వ సం. జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో 100-కి 85 మంది నిరక్ష్యరాస్యులు, ఆనాటి నుండి యీ నాటికి వుదారంగా లెక్కించిచూచినా 80 వంతులు అవిద్యాపరులే వున్నారు. వున్న కొద్దిపాటి విద్యయినా, ముఖ్యంగా ప్రాథమికవిద్య మన

దేశంలో ఎట్లా నడుస్తుందో మనకు తెలిసిన సంగతే "రెండు గదులు - విరిగిపోయిన ఒక వరండా కలిగిన ఒక చిన్న పసుపుల పాకలావుంది పల్లెటూరి బడి. లోపల కెళ్ళిచూస్తే ఎంత అసహ్యంగావుందంటే- కొన్ని రోజుల పర్యంతం యీ కొట్టం చీపురు ముఖాన్ని చూచిన పాపాన పోయినట్లు లేదు గోడలకు తెల్లని సున్నపుపూత లేకున్నా సూనే- లెక్కకు మిక్కుటంగా మలిన మరకలతో గోడల నిండివున్నాయి. పిల్లలు కూర్చునే చాపలు చినిగి చింపిరి పేలికలై పోయివున్నాయి- ఇక ఉపాధ్యాయులు వున్నతతరగతుల విద్యార్థులు- విరిగిపోయిన బెంచీలు, టేబిల్ ముక్కలపై కూలబడి వున్నారు. చక్కనిచిత్రం ఒకటయినా ఆ గోడలకు వేళ్ళాడదు. మ్యాపులుమాత్రం ఒకటి రెండు వున్నాయి- కాని అవి ఎంత శిథిలావస్థలో- అపరిశుభ్రంగావున్నాయంటే అవి ఇండియాకు ప్రాతినిధ్యం వహిస్తాయో. లేక ఇంగ్లాండుకో ఎవరూ చెప్పలేరు. అవి బహుశా ఒక వున్మాద జగత్తును ప్రతిబింబిస్తాయేమో! అని అన్నారు. మన ప్రాథమిక విద్యామందిరాలపై బ్రెయిల్స్ఫర్డుగారు తన "సబ్జక్టు ఇండియా" అన్న గ్రంథంలో.

గ్రామందాటి, వ్యయప్రయాసలకులోనై, వున్నత విద్యను అభ్యసించినా, అతనికి వుద్యోగపు గ్యారంటి ఎవరిస్తారు? యీమధ్యన ప్రకటితమైన ఒక రాష్ట్ర లెక్కలప్రకారం- ప్రభుత్వ ఎంప్లాయిమెంటు ఎక్చేంజీకి 10 లక్షల మంది అప్లికేషన్ లుపెట్టుకొంటే 2500 మందికి ఆరు సంవత్సరాలలో

ఉద్యోగం చూపించారు. అంటే వుండే ప్రతిపనికి 400 మంది నోళ్ళు తెరచుకొని కూర్చున్నారనేగదా!

తగినంత పనివుంటే- పనికి తగిన ఫలితంవుంటే- చాలినంత తిండిలేదనే సమస్యరానేరాదు. అదంతా లభించినప్పుడు అనారోగ్యం అంత భయంకర సమస్యగా పరిణమించదు- కాని ఎప్పుడైతే ఇవన్నీ అుదవుతాయో, ఆ దేశంలో అనారోగ్యం హద్దులెరుగకుండా వృద్ధవుతుంటుంది. మన దేశ స్థితి నేడట్టి దీనావస్థకు చేరుకొంది.

మన దేశంలో అనారోగ్యం ఎంత అధికంగా వుందో- వైద్యం అంత తక్కువగా అందుతూంది. నూటికి 80 వంతుల జనాభా మన దేశంలో పల్లెలలో నివసిస్తారు. కాని వున్న వైద్యులలో 100 కి 90 మంది పట్టణాలలో- మకాంపెట్టారు. ఇదయినా మన జనాభాకు సగటున లెక్కించిచూచినా చాలా తక్కువగావుంటూంది. ఇంగ్లాండులో ప్రతి వెయ్యి మందికి ఒక డాక్టరు. అమెరికాలో ప్రతి 750 మందికి ఒక డాక్టరు. రష్యాలో ప్రతి 600 మందికి ఒక డాక్టరు వంతునవుంటే, మన దేశంలో ప్రతి 6300 మంది జనాభాకు ఒక డాక్టరు వున్నారు. బ్రిటన్‌లో ప్రతి 300 జనాభాకు ఒక నర్సు వుంటే. మన దేశంలో ప్రతి 43000 మందికి ఒక నర్సు. బ్రిటన్‌లో ప్రతి 4770 మందికి ఒక టూరింగు డాక్టరు వుంటే- ఇండియాలో ప్రతి 4 లక్షలకూ ఒకరు. బ్రిటన్‌లో 618 మందికి ఒక మంత్రసాని వుంటే, ఇండియాలో ప్రతి 60000 లకూ ఒక

మంత్రసాని, బ్రిటన్‌లో ప్రతి 2700 మందికీ ఒక పంటి వైద్యుడయితే- మన దేశంలో ప్రతి 3 లక్షలకూ ఒక పంటి వైద్యుడు వున్నాడు. ఇల్లానే వివిధ వైద్యశాఖల్లోనూ మన దేశం అధోగతిలో పడిపోయింది.

యీ వైద్యానికి తగినట్లేవుంది మన సహాయరోగ్యం కూడా. మన దేశంలోనున్న మొత్తం 6 లక్షలు గ్రామాలను కలిపి- అందులోనున్న యిండ్ల సంఖ్యను లెక్కిస్తే 6 కోట్లా 64 లక్షల గృహాలు వున్నయి- ఇందులో రెండవ వంతయినా రాతితో కట్టిన దిట్టమయిన ఇండ్లు కావు. మిగిలిన వాటిలో 7 వంతులు మట్టి, తడికె, రేకు, మొదలయిన వాటితో నిల బెట్టబడిన నామకార్థపు మందిరాలు. ఇక మిగిలినవన్ని, గుహాలు, గుడిసెలు, కందకాల లాంటి అనారోగ్య కూపాలు. ఇండ్ల సమస్య వచ్చినప్పుడుకూడ- జనాభాను అడ్డువేసి- ఇంతమందికి ఎవరయితేమటుకు ఇండ్లు ఎచ్చట కట్టగలరు. అని నిస్పృహను వెల్లడిస్తారు. కాని జనాభా పెరిగితే తగిన ఇండ్లు కట్టుకోవడమే దానికి సమాధానమవుతుందిగాని- చేతు లువెల్లికిలవేసి విధికృతంపై విసుగుచూపిస్తే లాభమేమిటి. మన దేశంలో కిక్కిరిసిన జనాభా నివసించుతూందనుకొన్న బొంబాయినగరంకన్నా 1911 నాటికే లండన్ పట్టణంలో ఏడు వంతులు జనాభా అధికంగావుండేది. కాని అంకణానికి బొంబాయిలో 66 మంది నివసిస్తుంటే- లండన్‌లో 6 మంది వంతున నివసిస్తున్నారు. (ఎన్విరెన్ మెంటల్ హైజీన్ కమిటీ రిపోర్టు మంది లెక్కలు).

పని, తిండి, విద్య, వైద్యం, వసతి, ఒకటేమిటి అన్నిటిల్లోనూ మన దౌర్భాగ్యం అంతులేకుండా పెరిగిపోతూంది. అన్నిటికన్నా గొప్పస్థాయిలో అభివృద్ధి అయిందనుకొన్న మన బట్టల పరిశ్రమను తీసుకొని ప్రదర్శిద్దామన్నా, అప్పుడుకూడా మన దరిద్రాన్ని దాచను సాధ్యంకాదు.

సాలుకు తల 1-కి బట్ట వినియోగం.

| | | | | |
|---|---|---|---|---|
| అమెరికా | 64 గజాలు. | | తూర్పుయూరపు | 20.25 |
| యునైటెడ్ కింగ్‌డమ్ | 45 | ,, | జపాన్ | 20 |
| పశ్చిమ యూరపు | 45 | ,, | ఇండియా | 13 |

(గత నాలుగేండ్లలో తూర్పుయూరప్ పరిమాణం కొంత పెరిగింది).

ఇట్లా అన్నిటిల్లోనూ దిగజారిపోయిన మన దేశంలో మానవ జీవితం అనేక అవాంతరాలకు లోనై పెరిగినా, అధిక సంఖ్యాకులకు మాత్రం అస్థిత్వం ఒక నిత్య పీడనగా మారిపోయింది.

ఇండియా ప్రభుత్వ ఆరోగ్యశాఖ డైరెక్టరుగా పని చేసిన సర్. జాన్ మెఘా- మన ఆరోగ్యాన్ని గురించి "బెంగాల్ రైతుల్లో అధిక సంఖ్యాకులు తినే ఆహారాన్ని ఏడు వారాలపాటు ఎలుకలు భుజించినా, అవి మనడం కష్టం" అని వ్యాఖ్యానించారు. 1947 లో వెలువడిన కరువు కమీషన్ రిపోర్టులో- 30 వంతుల జనాభా చాలినంత తిండి తినటంలేదు, — అని వ్రాయబడింది. జనన మరణాల రిజిస్టరు,

ప్రకారం మన దేశంలో సాలుకు 60 లక్షలమంది చనిపోతారు వున్న జనాభాలో మూడింట రెండు వంతులు మాత్రమే యీ రిజిస్టరులో వుదహరించబడి వున్నారనేది తెలిసిన తర్వాత- రిజిస్టరు కాని వారితో కలిపి సం॥ 1-కి మన దేశంలో 85 లక్షల మంది చనిపోతారని ఇండియన్ ప్రభుత్వ పబ్లిక్ హెల్తు కమిషనర్ గారు లెక్కించారు. యీ లెక్కన 10 సంవత్సరములలో మన దేశంలో 8 కోట్లమంది చనిపోతారు. అంటే బ్రతికివున్న ప్రతి ఐదుగురికి ఒకరు వంతున పరంపదం చెందుతుంటారు. కానియూరోపు ఖండం అంతా కలిపి చూచినా సంవత్సరానికి 53 లక్షలు మాత్రమే మరణిస్తారు.

భారత దేశంలో వయసు ప్రమాణం వీటన్నిటిని పట్టే గదా వుంటుంది? సగటున మన దేశంలో మనిషి 27 సం।లకు పైన జీవించడు. (పురుషులు 26.91 స్త్రీలు 26.56) కాని ఇతర దేశాలలో వయసు ప్రమాణం నిత్యం పెరిగిపోతూవుంది. ఇండియాకన్నా 2½ వంతు వయసు ప్రమాణం ఏ దేశంలో చూచినా పెరిగింది.

మన దేశంలో పుట్టిన ఆడుపిల్లలలో నాలుగవవంతు ఒక సంవత్సరంలోపులే చనిపోతారు. 50 వంతులు మాత్రమే 20 సం.లు చేరుకోటారు. పిండోత్పత్తి ఆగిపోయిన తర్వాత నాలుగవ వంతు తల్లులుమాత్రమే బ్రతుకుతారు. ఇంగ్లాండులో నాలుగింట మూడువంతులు ఆడపిల్లలు 55 సం వరకు బ్రతుకుతారు. కాన్పుల కాలంలోనే సంవత్సరానికి 2 లక్షల

తల్లులు మన దేశంలో మరణిస్తారు. 1000 మంది తల్లులలో 20 వంతులు ప్రసవించలేక చనిపోతారు ఇట్టి వారిసంఖ్య ఇంగ్లాండులో రెండు వంతులే.

ఒకసంవత్సరంనుండి నాల్గు సంవత్సరముల లోపు పిల్లలచావులు

| (1000 లో వంతు) | మగ | ఆడ |
|---|---|---|
| ఇండియా | 34.3 | 31.6 |
| ఇంగ్లాండు | 3.7 | 3.7 |
| అమెరికా | 3.1 | 2.7 |

మన దేశంలో సంవత్సరానికి ఒక్క మలేరియాతోనే 10 కోట్ల మంది బాధపడుతున్నారు. మలేరియా - ఇతర జ్వరాలవల్ల సం 1కి 36 లక్షలమంది చనిపోతే, క్షయవ్యాధి 7 లక్షల మందిని ప్రాణం తీస్తుంది సం॥ 1-కి 25 లక్షల మంది క్షయతో బాధపడతారు. కడుపు వ్యాధులు 3 లక్షల మందిని వేధిస్తే కుష్టురోగం 10 లక్షలమందిని పీడిస్తాంది. లక్షజనాభాకు 185 మంది కంటిజబ్బులు - గుడ్డితనం తో కుళ్లిపోతుంటారు.
( డాక్టర్ బెన్‌జమన్‌గారి "రిపోర్టు ఆఫ్ హెల్త్‌సర్వే," "సెంట్రల్ అడ్వైజరీ బోర్డు ఆఫ్ హెల్త్" మొదలైనవారి రిపోర్టుల నుండి లెక్కలు )

ఇన్ని ఆటంకాలు - అవాంతరాలు దాటి మన దేశంలో మనిషి బ్రతుకను ప్రయత్నిస్తే మనిషికి వుండవలసిన సగటు పొడవు- బరువు అతిహీనంగా భాసించి- ఆన తోరిపో మేటిక్.

స్టాన్ డర్డుకన్నా, పొడవు- బరువులో మనం 10 వంతులు తక్కువవున్నాము.

యీ విధంగా తిండి కొరతనూడి- అనారోగ్యం- అకారణ మరణాలు- జీవిత పర్యంతము పీడించే వ్యాధులు ముదిరి- మహామ్మారీలా ముసురుకవచ్చే కరువుకాటకాలు, నిత్యం లక్షలాది నిండుప్రాణాలను నిలువున కూల్చివేయడం మన దేశంలో నిత్యకృత్యం అయిపోయింది.

ఇదంతా వినిన తర్వాత మనం విచారంతో తలవంచుకొనవలసివస్తుంది. ఒక పీడకలను చూచిన తర్వాత మనసు పడే వ్యాకులత లాంటి బాధ మనను పట్టుకొంటుంది. అయితేమటుకు ఏమిచెయ్యగలం- మన దేశంలో తగినంత భూమి లేదేమో- వున్నా అది వ్యవసాయమునకు పనికిరాదేమో- పనికివచ్చి పండినా పెరుగుతున్న మన మానవ కోటికి అది తగినంత భుక్తినివ్వదేమో- అన్న ఆందోళనకరమైన ప్రశ్నలు మామూలుగా మనల వేధిస్తాయి. పైగా మన దేశంలోనున్న ప్రతికొరతకు కారణం-పెరుగుతున్న జనాభాయే నని చవకగా సూత్రీకరించడం మనంవింటున్నాము. కానిఆవిధంగా పుట్టినవారిని, పుట్టించేవారిని, పుట్టబొయ్యేవారిని నిందించుకోనడం నిరుపయోగం మన దేశంకన్నా ప్రపంచంలో అన్ని దేశాలలోనూ జనాభా పెరుగుదల అధికంగావుందని మనకు తెలుసు. అందువల్ల పెరుగుతున్న జనాభాపై నేటి దౌర్భాగ్య భారమునుదించితే అది తీరుతుందా? విశ్వంలో యీ భాగంలో

స్త్రీ-పురుష సంయోగం చండాలమని శాశిస్తామా? అది అనివార్యమయినా- పిండోత్పత్తి ఖండనార్హమంటామా? ఇట్టి వాదనలూ, ఆలోచనలు అసహజమైనవేగాక, ఆచరణకు అసాధ్యమైనవి, అమానుషమైనవికూడాను. అందువల్ల పెరుగుతున్న మన అవసరాలకు, తగినంత వుత్పత్తి దాని వినిమయం ఏ విధంగా చేయగలం అన్న వాస్తవిక నిర్మాణ దృక్పధంనుండి విషయాన్ని పరిశీలించాలేగాని, బాబోయి ఈ పెరుగుదలకు ఇక పరిష్కారమే లేదు! అని చప్పరించడం అసలు సమస్యను మభ్యపరచను- దేశాన్ని దివాలాకొట్టించను మాత్రమే అట్టి నిర్వీర్యత దారితీస్తుంది.

# మన భూమి - మన వ్యవసాయం

మన దేశంలోనున్న జనాభా అంత నాలుగింతలు జనాభాకు కావలసినంత తిండిని వుత్పత్తిచేసుకొనతగిన భూమి మనకు వుంది. భౌగోళికంగా భారత దేశం (ఇండియన్ యూనియన్) 81 కోటి 10 లక్షలు ఎకరములు వుంది. కాని ఇందులో 61 కోటీ 50 లక్షల ఎకరములకు మాత్రమే ఇంతవరకు సర్వే జరిగింది. ఆ లెక్కల ప్రకారము మన భూమి యీ క్రింది విధంగా విభజించబడివుంది.

సర్వే జరిగిన భూమి విభజన.

| | | |
|---|---|---|
| అడవులు | 9 కో. 30 ల ఎకరాలు | 15-వ వంతు |
| నికరసాగు | 26 కో. 60 ల | 47 |
| మామూలు బీళ్లు | 5 కో. 80 ల | 9 |
| సాగుకులాయకైనభూమి | 9 కో. 80 ల | 16 |
| సాగుకుపనికిరాని భూమి | 9 కో. 60 ల | 16 |

ఇందులో 3 కోట్ల 55 లక్షల ఎకరములలో, రెండవపంట పండు తుంది. సాగవుతున్న మొత్తం భూమిలో 78 వంతులు ఆహార ధాన్యాల పైర్లక్రిందవుంది. కాని నీటిసౌకర్యం కల్పించ బడ్డ భూమి 40 సం.లలో 10 వంతులు మాత్రమే పెరిగింది. రెండవ కారు పండే ప్రదేశంకూడా అంతే. 4 కోట్లా 80 లక్షల ఎకర ములకు మాత్రమే నీటివసతులు వున్నాయి. (ప్రథమ పంచవర్ష ప్రణాళిక నుండి లెక్కలు) కాని యీనీటివసతులు స్థిరమైన సప్లయిని ఇచ్చేవి కానేకావు. వుదాహరణకు, నదులనుండి నిలకడగా సప్లయిచేయగలిగిన సరఫరా, కాలువలక్రింద 1 కోటి 70 లక్షల ఎకరములు మాత్రమే సాగవుతుంది. మిగిలిన నీటిసాగు అనబ డేది అంతా వర్షంపై ఆధారపడ్డ చెరువులు, బావులక్రింద సాగవుతూంది. మన దేశంలోనున్న బ్రంహ్మాండమైన నదీ జలాలలో 6-వ వంతు మాత్రమే మనం వ్యవసాయమునకు వినియోగిస్తే, మిగిలిన నీరు సరాసరి సముద్రుడిలో కలిసి పోతూంది. నిజానికి మన దేశంలో జనాభాకు తగినంత భూమి ఇప్పటికే మనం సాగుచేస్తూనేవున్నాము. అయితే, అందులో పండవలసినంత పంటను మనం ఏనాడూ పండించి ఎరుగము. విదేశాల పంట ప్రమాణంతో పోల్చితే మన ఫలితం ఎంతగా వెనకపడివుందో తెలిసిపోతుంది. ప్రధానమైన బియ్యపు వుత్ప త్తినే పోల్చుదాము.

— ఒక ఎకరములో పౌనులు —

| | | | |
|---|---|---|---|
| ఇండియా | 800 | ఈజిప్టు | 2000 |

| | | | |
|---|---|---|---|
| చైనా | 1400 | జపాన్ | 2300 |
| అమెరికా | 1450 | ఇటలీ | 3000 |

గోధుమపంట, ఇండియా 800 పౌన్లు పండిస్తే, జపానులో 2200, ఇటలీలో 1350 పౌన్ల వరకూ, పండించుకున్నారు. ఇంతెందుకు, మన దేశంలోనే నీటిసాగుకూ, మెట్టసాగుకూ వున్న వ్యత్యాసం మనకు తెలిసేవుంది.

— వరిపంట ఎకరాకు పౌన్లలో —

| | నీటి క్రింద | - నీరు లేకుండా |
|---|---|---|
| మద్రాసు రాష్ట్రం | 1694 | 1138 |
| సి. పి. | 1200 | 900 |
| యు. పి. | 1100 | 850 |
| పంజాబ్ | 1269 | 587 |

— గోధుమ —

| | | |
|---|---|---|
| యు. పి. | 1200 | 800 |
| బొంబాయి | 1250 | 510 |
| పంజాబు | 967 | 512 |
| సింధు | 937 | 734 |

నీటిసాగుకు, మెట్టసాగుకువున్న వ్యత్యాసాన్ని గమనించినప్పుడు, అధికోత్పత్తికి ప్రధానమయిన సహాయంలో, నీటి వసతికూడా ఒకటి అని తేలుతూంది. వ్యవసాయ నిపుణుల

వాదం ప్రకారం, నీటివసతే ఆహార ధాన్యాల రక్షణకు ఒక ప్రధానసమస్య అయ్యేట్లయితే, మనదేశం యీ శతాబ్ద ప్రారంభంలో ఎంత నీటివసతులు కలిగివుండిందో, దాదాపు ఇప్పుడూ అదే నీటివసతుల క్రిందవుంది. అవికూడా అధికంగా చెరువులు, భావులక్రింద వుండడం మూలాన అస్థిరమైన వర్షం అనిశ్చితమైనపైర్లు. పంటలకు కారణమైవుంది. మన దేశంలో నున్న పల్లపుసాగులో అధికభాగం నానాటికి శిధిలమౌతున్న చెరువులక్రింద వుంది. నేటి మన చెరువుల గురించి మద్రాసు రాష్ట్ర మాజీ ప్రధాని శ్రీ ఓ. పి. రామస్వామిరెడ్డిగారి చేత "పంటస్థిరత్వానికి, మనచెరువులు నీటి నిలయాలుగా వర్ణించ బడ్డాయి. కాని దురదృష్టవశాత్తు నేడట్టి చెరువులలో అధిక భాగం ఓటిబొచ్చెలుగా మారిపోయ్యాయి. ఇట్టి 33 వేల చెరువుల క్రిందే నేడు మద్రాసు రాష్ట్రంలో 32 లక్షల ఎకర ములు సాగులోవుంది" అన్న వ్యాఖ్యాలు దేశం మొత్తానికి వర్తిస్తాయి. ("అగ్రేరియన్ రిఫారమ్సు" అన్న రిపోర్టులనుండి).

1947 ఆగష్టు నాటికి, అంటే- మన దేశానికి స్వతంత్రం వచ్చే నాటికి, మన నీటి నిలవలలో 100-కి 5 వంతులు మాత్రమే వ్యవసాయమునకు వాడేవారము. అప్పటినుండి- అధికోత్పత్తి- అభ్యుదయ ప్రణాళికలు రెండు సంవత్సరాలు గడిపి వేసిన, పంచవర్ష ప్లాను- మొదలైనవి అన్నీ కలిసి 1-వ వంతు నీటినిమాత్రమే వ్యవసాయమునకు వుపయోగించగలి గాయి. అధికంగా భూమిని సాగులోకి తీసుకరాకుండా నే-

ఇప్పుడున్న వ్యవసాయమునే పెంపొందించి, దైన్యస్థితిలోనున్న మన ఆహార కొరతను అరికట్టను అనేక అవకాశములున్నట్లు వ్యవసాయ శాస్త్రజ్ఞులు వివరించుతున్నారు. నేడున్న నీటి వసతుల, సుస్థిరంచేయడంద్వారాను, కనీసం ఇంకో 6 వంతుల మన నీటి నిలువలను వ్యవసాయమునకు వినియోగించడం ద్వారాను, ఇప్పుడు వుత్పత్తి అయ్యే బియ్యమంత రెండంతలు సులభంగా అధికంచేయవచ్చు. (నేటి మన బియ్యపు వుత్పత్తి 2 కోట్ల టన్నులు) మన దేశంలో నేడు నీటివసతుల క్రిందనున్న 4 కోట్లా చిల్లర ఎకరములు జపాన్ వుత్పత్తి దామాషానా పండించితే ఇప్పటి మన జనాభాలో సగానికి పైగా ఆ అధికంగా పండే పంటతో పోషింపబడుతుంది. (జపాను దేశ నీటి సాగు 1 కోటి 60 లక్షల ఎకరములు, కాని పంట మనకు మూడు వంతులు అధికం) మనలో సగం జనాభా వున్న రష్యా, మొదటి ప్రపంచయుద్ధం తర్వాత వ్యవసాయమును, ఆధునిక పద్ధతుల్లో అభివృద్ధిచేసి 4 కోట్లా చిల్లర టన్నుల బియ్యమునే వుత్పత్తి చేయగలిగింది.

ప్రపంచ వ్యవసాయ అభివృద్ధి అనుభవాలను, మన దేశంలోనున్న భూమి, నీరు మొదలైన విషయాలను దృష్టిలో వుంచుకొని డాక్టరు బరన్స్- రసాయనిక ఎరువులు, నీటివసతులద్వారా ఇప్పుడున్న భూమిలోనే 20 నుండి 50 వంతుల వరకూ అధికంగా పండించవచ్చునన్నారు. కేంద్ర ప్రభుత్వ వ్యవసాయ నిపుణులు ఈ మధ్యన ప్రకటించిన రిపోర్టుల ప్రకారం, నీటి వసతుల ద్వారానే 50 వంతులు, రసాయనిక

ఎరువుల ద్వారా 30 వంతులు, మంచి విత్తనాల ద్వారా 10 వంతులు, ఆధునిక వ్యవసాయ పరికరాలద్వారా 10 వంతులు- అల్లా మొత్తం 100-కి 100 వంతులు పంటను అధికం చేయవచ్చునన్నారు.

యీ ఆశాపూరిత అంచనాలు చూచినప్పుడు- ఒక్క గంతులో ఇంత గొప్ప అభివృద్ధి జరుగుతుందా! అని మనకు ఆశ్చర్యం కలగవచ్చు. కాని అల్లా పెంపొందిన దేశాలున్నాయి. ఇది అబ్బురం మాత్రం కాదు. అంతేగాకుండా- యీ అభివృద్ధి తక్షణం మనం సాధించగలిగినా- మన అవసరాల దృష్ట్యా అది అంత గొప్ప వుత్పత్తి అని అనుకోనలేము. ఎందుకంటే, మనకు ఇప్పుడు సగటున దొరికే అహారం 2000 కాలరీలు మాత్రమే, ఇది 4000 వేల కాలరీలకు పెరిగితే పశ్చిమ దేశాల ఆహారప్రమాణానికి మనం చేరుకొంటాము. సగటున 2800 కాలరీలు- రోజు 1-కి ఒక మనిషికి అందించను 13కోట్లా చిల్లరటన్నుల ఆహారధాన్యాలు కావలసివుంది. మన కిప్పుడున్నది 6 కోట్లా చిల్లర టన్నులు మాత్రమే. ప్రభుత్వ ఐదేండ్ల పథకాలతో జరిగే అభివృద్ధి ప్రకారం ఇంక మూడేండ్లకు మనం 7 కోట్లా చిల్లర టన్నులకు చేరుకొంటాము. దీనినిబట్టి మనకు కావలసిన కనీస ఆహారమయిన 2800 కాలరీలకు- ఐదేండ్ల అభ్యుదయం పెంపొందిన తర్వాత కూడా ఎంతదూరంగా వుంటామో తేటతెల్లమౌతుంది.

ఇప్పుడు సాగులోనున్న భూమిలోనే ఆధునిక వ్యవ

సాయ పద్ధతులు నీటి గ్యారంటీచేస్తే అంతకంత అధికోత్పత్తి సాధించవచ్చని తేలింది పోనీ ఏ కారణంవల్లనో వున్న భూమిలో కావలసినంత పండించలేమేమో అనుకొన్నా, క్రొత్తసాగుకు దిక్కు లేనంత భూమి వుండ నేవుంది. 15 కోట్ల ఎకరాల భూమి సాగు లాయక్కై వున్నదని నేటి మన సర్వే లెక్కలు తెలుపుతున్నాయి. ఇందులో 5½ కోటి యకరాలను తక్షణం సాగులోకి తీసుకరావచ్చు. అందువల్ల మనసుంటే- మార్గంవుంటుంది, అన్నట్లు- వుపయోగించుకొన చాతనయితే, కావలసినంత భూమి, నీరు, జనాభా, ఇతర వసతులు మనకువున్నాయి.

ఆహార ధాన్యాల కొరతతోనే ఆగదుగదా మన దీనావస్థ, ఇతర తిండిపదార్థాలు కూడా తీరని కరువును కనుపరుస్తున్నాయి. పప్పు 20 వంతులు, పండ్లు 50, కాయకూరలు 100, కొవ్వు- చమురు 250, పాలు 300, చాప- మాంసం- గ్రుడ్లు 300, వంతులు లోటువున్నాయి. (మనదేశంలో కావలసిన సమీకృత ఆహారమునకు- బ్యాలన్స్డ్ డయిట్- పోలికలో బయటపడిన లోటు లెక్కలు) యీ కొలతలను కూడా ఒక క్రమపద్ధతి ననుసరించి తీర్చవచ్చు. వుదాహరణకు మన పాలకొరతపై డాక్టర్ రైట్ పరిశీలనలో, కఠినమైన వాస్తవాలు కొన్ని బహిర్గతమయ్యాయి. నేడు మనకున్న పశుకోటికి 50 కోట్ల టన్నుల ఎండుగడ్డి కావలసివుంటే- మనకు లభించేది 11 కోట్ల టన్నుల ఎండుగడ్డి 10 కోట్ల టన్నుల పచ్చిక, 15 లక్షల టన్నుల ఇతర మేత, 23 లక్షల టన్నుల పత్తిగింజలు మాత్రమే. అంటే

కావలసిన దానికి 60 వంతులు లోటువుంది. అందువల్లే మన పాల వుత్పత్తి విదేశాలవుత్పత్తితో పోల్చితే ఐదింట ఒక వంతు లోటులోవుంది. అందువల్ల మన గడ్డి కొరతల తీర్చుకొనను కృషిచేయడం ద్వారా పాలకొరతను బత్తీచేయవచ్చు.

కాని, నేటి మన ప్రభుత్వం, ప్రమాదకరమైన సర్వ నాశనానికే దారితీస్తున్న మన కొరతల పూడ్చివేసి- నేటి ఘోర దౌర్భాగ్య వాతావరణం నుండి దేశాన్ని బయటికి లాగను చెప్పుకోదగిన గొప్ప ప్రయత్నాలేమీ తలపెట్టక పోవడం విచారకరమైన విషయం. అయితే రెండు కోట్లా చిల్లర రూపాయలు ఖర్చుచేయను వుద్దేశించబడ్డ ప్రథమ పంచవర్ష ప్రణాళిక వుందిగదా అన్న ప్రశ్న సహజంగా ఎదు రౌతుంది. ప్రణాళికలో కనుపరచిన పంశాలపేరుతో, ధనం మాత్రం కర్చు అవుతుంది. అది సందేహించనక్కరలేదు. కాని ఆ ఖర్చుకు తగిన ప్రతిఫలంరాదని చెప్పుకొనను గూడా సందేహించ నక్కర్లేదు. పోనీ ప్రభుత్వఅంచనాల ప్రకారం ప్రణాళిక 1955 నాటికి అన్ని అంచనాలను పూర్తి చేసిందనే అనుకొందాం. అప్పుడయినా మన ఆహార సమస్య పరిష్కార మవుతుందా? దీనిప్రకారం మన తిండిగింజల ప్రమాణం 1955 నాటికి 14 ఔన్సులకు పెరుగుతుంది. ( 1950 లో మనరేషన్ 13.71 ఔన్సులు ) దాని కనుగుణంగా పప్పు 3 ఔన్సులు. సమురు 2, చాప, మాంసం, గుడ్లు 5 ఔ, పాలు 10 ఔ. పెరుగుతుందని అంచనావేశారు. అంటే ఈ ప్రమాణం అందుకొనను 7 కో,

60 లక్షల టన్నుల ధాన్యమే కావలసి వుంటుంది. (విదేశ దిగుమతులతో కలిపి మనధాన్యం ఇప్పుడు 6 కోట్ల 70 లక్షల టన్నులు) అంటే 14 వంతులుధాన్యోత్పత్తి అధికం కావలసివుంటుంది.

కాని అప్పుడుకూడా 1955కు. ప్రభుత్వం ఆశించే అన్ని రకాల వుత్పత్తి అధికం అయినా- మనకు సమీకృత ఆహారం అందదు. సరిగదా! జైలు కేపనుకన్నా మన ఆహారం అప్పుడూ తక్కువగానేవుంటుంది. 1936 సం॥లో జైలు మాన్యుయల్ ఒక ఖైదీకి 20 ఔన్సులు ధాన్యం. 4 ఔ పప్పు, 2 ఔ చమురు, 2 ఔ. చక్కెర, మొదలైనవి నిర్దేశించింది. ప్రభుత్వ ఆశలు ఫలించి, వారనుకొన్న ఆ కొద్దిపాటి అభివృద్ధి అయినా కనుపిస్తుందని వూహించను, ఇప్పటికే రెండేండ్లు గడపిన ఐదేండ్ల ప్రణాళిక నడక, దాని వైఫల్యాన్ని చాటుతుంది.

## ధాన్యోత్పత్తి అధికమైనా దరిద్రం తీరనేరదు

పంచవర్ష ప్రణాళిక ఫలించినా మన తిండి తరుగు తీరనేరదని ప్రభుత్వ లెక్కలే బహిర్గతంచేసిన తర్వాత- ఆహారోత్పత్తిని అధికంచేయను జపాను పద్ధతితో- లేక ఏదో ఒక ఆధునిక పద్ధతిన, మన ఆహారోత్పత్తి అధికం అవుతుందే అనుకొన్నా, దానితో మన దరిద్రం తీరుతుందా? అన్న విషయం కూడా అతిప్రధానమైంది. వుత్పత్తి పెరిగితే మనది మిగులు దేశమని చాటుకొన చక్కని అవకాశం లభించవచ్చు. కాని అందరికీ తిండి గ్యారంటీ మాత్రం జరగదు. ఎందువల్లనంటే

మన సగటు నికర ఆదాయం ఎంత తక్కువో చూచాం. మొత్తం జాతీయ వృత్పత్తి పెరగడం ద్వారా- యీ జాతీయ ఆదాయం కూడా కొంత లెక్కలలో పెరుగుతుంది. కాని అది లెక్కలలో పెరిగినా, అనుభవంలో అధిక సంఖ్యాకులకు అందదు. కారణం, అధికసంఖ్యాకులకు ఆస్థిలేదు. కొంత మందికివున్నా చాలీచాలని చిల్లర ఆస్తివుంది- అందువల్ల ఆస్థి అంటే భూమి- ఇతర వృత్పత్తి సాధనాలు, ఎవరి క్రిందయితే వుంటాయో- వాటి ద్వారావచ్చే ఫలితం వారికే చెందుతుంది. ఆస్థిలేనివారి అవస్థ- నిరుద్యోగం- దరిద్రం యథాతథంగా వుండిపోయి, అధికోత్పత్తి ఇంకోరకమైన ఆర్థిక వడిదుడుకులకు దారితీయకతప్పదు.

అందువల్ల వ్యక్తిగత ఆస్థి పద్ధతిపై ఆధారపడ్డ నేటి సమాజంలో సగటు సంపద పెరిగినా దాని ప్రయోజనం కొద్దిమందికి మాత్రమే దక్కుతుంది. కాబట్టి సగటు వృత్పత్తి పెంపకంతోపాటు, సగటు వినిమయం జరిగేందుకుకూడా మార్గాలు అన్వేషించి- అనుసరించని యెడల, నేటి ఆహార సమస్య పరిష్కారం కావడం దుర్లభం. ముఖ్యంగా ఆహార సమస్యపై ఆందోళనకరంగా మారిపోయిన, మన పరిస్థితి యొక్క సంపూర్ణ స్వరూపమును అర్థంచేసుకొనను- ఆహారము నకు మూలమయిన భూమి నేడెలా విభజించబడివుందో పరిశీ లిస్తే- ఎవరైతే దానిపై పనిచేస్తున్నారో వారికి భూమిలేదని అందువల్ల ఆ భూమిలో అధికపంటలు పండించినా వారికి చెంద

వని, అల్లా పండించనుకూడా వ్యవసాయదార్లకు వుత్సాహం కలిగివుండను వీలులేనంతగా, రోజురోజూ వారు భూమికి వేర్రై పోతున్నారని మనకు స్పష్టమవుతుంది.

మన దేశంలో భూమిని గతంలో- ఒకానొక దశలో సమిష్టిగా గ్రామమంతా అనుభవించేవారు- క్రమేపీ ఆస్థితి మారాయమై భూమిపై వ్యక్తుల పెత్తనం వచ్చింది- 1882 జనాభా లెక్కల ప్రకారం భూమిపై పనిజేసే వారిలో 72½ ల క్షలమంది భూమిలేని వారని వ్రాయబడివుంది. 1921 నాటికి ఈ సంఖ్య 2 కోట్లా 10 లక్షలయిపోయింది. మరి పది సంవత్సరాలకు- 1931 నాటకి- భూమిలేని వ్యవసాయకుల సంఖ్య 3 కోట్లా 30 లక్షలకు పెరిగింది. అంటే వ్యవసాయకులలో మూడింట ఒక వంతు భూమిలేనివారయిపోయ్యారు. భూమి లేని వ్యవసాయకుల సంఖ్య ఇప్పుడు 100-కి 30 నుంచి 40 వంతు లుంటుందని అంచనా వేశారు. యీ భూమి లేని వారికి దాదాపు సరిసంఖ్యలో కౌలుదార్లు వున్నారు- 20 వంతులు పేరుకు మాత్రమే భూమివున్న వ్యవసాయకులు 1916-17 సంవత్సరాలనుండి 1947-48 సంవత్సరాల మధ్య కాలంలోనే, వ్యవసాయం ఎటువంటిదో ఎరుగని భూకామందుల క్రిందనున్న భూమి 12 నుండి 30 వంతులకు పెరిగింది. ( కేంద్ర కార్మిక మంత్రి వర్గ లెక్కల నుండి )

అంతే గాదు. దున్నేవారినుండి భూమి ఇతరులకు చెందడం ఒక వైపు జరుగుతుంటే- రెండవవైపు భూమిపై

ఆధారపడి బ్రతుకు వెళ్లబీదేవారి సంఖ్య విరివిగా పెరిగిపోతూ వుంది- 1931 లో 100కి 67 వంతుల జనాభా వ్యవసాయంపై ఆధారపడితే 1951 జనాభా లెక్కలో- యీ సంఖ్య 70 వంతులకు పెరిగింది. అంటే 24 కోట్లా 91 లక్ష మందికి వ్యవసాయమే తరుణోపాయం అయిపోయింది. ఆ వున్న భూమిలో కూడా సారవంతమయిన భూమి, అధికంగా కొద్దిమంది హస్తగతం అయిపోయింది.

భూమిపై హక్కు వున్న వారిలో 50 లక్షల మంది మాత్రమే భూస్వామ్యవర్గీయులని చెప్పవచ్చు. యీ సంఖ్యను బట్టి వ్యవసాయంపై ఆధారపడే వారిలో 100-కి 2-వ వంతు మాత్రమే యిట్టి భూస్వామ్య వర్గీయులుగావున్నారని తేలుతుంది. మొత్తం జనాభాలో వీరి సంఖ్య 1 వంతు మాత్రమే కాని జనాభాలో ఒక వంతయిన వీరి క్రింద 70 వంతులభూమి వుంది. ("భవానీసేన్‌గారి అగ్రేరియన్ క్రైసిస్ ఇన్ ఇండియా – ఆండ్ రియాక్షనరీ ప్లాన్స్" అన్న గ్రంధంనుండి లెక్కలు)

ఆహార సంక్షోభమునకు మూలమైన యీ అక్రమ భూ విభజన ఎంత అనర్ధదాయకంగా తయారవుతుందో వివరంగా తెలుసుకొనను మద్రాసు రాష్ట్ర భూవిభజనను పరిశీలించి చేచాలు.

మద్రాసురాష్ట్రంలో సాగులోనున్న భూమి 3 కోట్లా 13 లక్షలా 7 వేలా 676 ఎకరములు- వ్యవసాయములో పని జేసేవారు 3 కోట్లా 61 లక్షలా 42 వేలా 332 మంది

(1951 మద్రాసు ప్రభుత్వ లెక్కలనుండి) ఇందులో రెండు కోట్లా పై చిల్లర తమ స్వంత భూములపై పని చేస్తారు. 50 లక్షలమంది తమ భూముల కౌలుకిస్తే - 50 లక్షలకు పైగా స్వంత భూములు లేని కౌలుదార్లు వున్నారు. కొద్దిపాటిభూమివుండీ ఇతరుల భూమిని కౌలుకుచేసేవారు 54 లక్షలకు పైబడి వున్నారు.

రైతువారీ లెక్కలను ప్రత్యేకించి (అంటే ప్రభుత్వ అధీనంలోలేని జమీన్, ఇనాం, శ్రోత్రియం, మొదలైన భూముల మినహాయించి) మద్రాసురాష్ట్రంలో ప్రత్యేకించి పరిశీలిస్తే 2 కోట్లా 76 లక్షల ఎకరాలు, 72 లక్షల మంది రిజిష్టరు పట్టాదార్ల క్రింద వుంది. ఇందులో 50 రూపాయల లోపు శిస్తు చెల్లించేవారు 70 లక్షలమంది అయితే, వారి చేతి క్రింద నున్న భూమి నీటిసాగు 31 లక్షల ఎకరములయితే, 185 లక్షల ఎకరాలు మెట్టసాగు. ఈ 70 లక్షల మందిలో కూడా 10 రూపాయల లోపు శిస్తు చెల్లించేవారు 56 లక్షల మంది. ఇట్టి వారి క్రింద నీటిసాగు 11 లక్షల ఎకరాలయితే, 102 లక్షల ఎకరాలు మెట్టసాగు క్రింద వుంది. కాని 50 రూ.లకు పైబడి శిస్తు చెల్లించేవారి క్రింద నీటిసాగు 22 లక్షల ఎకరాలయితే, 38 లక్షల ఎకరాలు మెట్టవుంది. అంటే 100-కి 97 వంతులైన బీదరైతుల క్రింద 59 వంతుల భూమి మాత్రమే వుంటే- 3 వంతులైన పెద్దవారి క్రింద 41-వ వంతుల భూమివుంది. (యిట్టి పెద్దవారి క్రింద నున్న భూములకు స్థిరమైన నీటి సప్లయిలు వున్నవి) ఇక మెట్ట భూములు,

విస్సారమయిన రకం, 100-కి 83 వంతులు చిన్నవారివైతే 17 వంతులు మాత్రమే పెద్దవారివి. యీ అక్రమ విభజన సంపూర్ణ రూపాన్ని ఈ క్రింది పటం మరింత స్పష్టంగా బహిర్గతంచేస్తుంది.

— మద్రాసురాష్ట్రంలో రైతువారీ భూ విభజన —

| ఎకరముల పరిమాణం | లక్షల సంఖ్యలో పట్టాదార్లు | సగటు లెక్కలో వర్గ సంఖ్య దామాషా | లక్షల ఎకరములలో వారికున్న భూమి | ప్రతి వర్గానికి వున్న భూమి దామాషా | సగటు భూమి సైజు | మాగాణి దామాషా |
|---|---|---|---|---|---|---|
| ఎకరం లోపు భూమి | 16.4 | 22.8 | 9.5 | 3.4 | 0.58 | 0.07 |
| 1 నుండి 3 ఎకరముల వరకు | 39.7 | 55.1 | 104.3 | 37.8 | 2.6 | 0.2 |
| 3 నుండి 9 ఎకరముల వరకు | 11.2 | 15.6 | 75.0 | 27.2 | 6.7 | 1.2 |
| 9 నుండి 12 ఎకరముల వరకు | 2.7 | 3.8 | 28.3 | 10.2 | 10.7 | 2.8 |
| 12 నుండి 18 ఎకరముల వరకు | 1.4 | 1.9 | 23.4 | 8.3 | 16.7 | 5.1 |
| 18 నుండి 50 ఎకరముల వరకు | 0.46 | 0.6 | 16.9 | 6.2 | 42.0 | 16.0 |
| 50 ఎకరములకు పైబడి, | 0.14 | 0.2 | 18.9 | 6.9 | 134.0 | 55.0 |

వరా:— భూమి లేని 60 లక్షల మంది వ్యవసాయ కూలీలు, కౌలుదార్లు యీ భూములపైన్నే బ్రతుకుదెరువుకు ఆధారపడి పనిచేస్తున్నారు. యీ లెక్కల ప్రకారం 93.5 వంతుల వ్యవసాయకుల క్రింద 68.4-వ వంతు భూమి వుంటే 6.5 వంతుల భూకామందుల క్రింద 31.6 వంతుల భూమి వుంది. ఈ పెద్దవారి క్రిందనున్న భూమిలో అధికభాగం స్థిరమైన నీటివసతులు కలిగిన సారవంతమైన క్షేత్రాలు.

శ్రీ ఓ. పి. రామస్వామిరెడ్డిగారి లెక్కలు పరిశీలించినా ("ప్యారిటీ ఎకానమీ" అనే రిపోర్టులో) 50 వంతుల రైతు కుటుంభాలు రెండెకరములలోపు భూమి కలిగివుంటే- 2 నుండి 5 ఎకరముల భూమివుండే వారు 30 వంతుల కుటుంభాలు, 5 నుండి 10 ఎకరాల మధ్యవారు 7వ, వంతు, పది ఎకరములకు పైబడి వుండేవారి సంఖ్య 10 వంతులు మాత్రమే. అంటే 80 వంతు కుటుంభాలు ఐదు ఎకరముల లోపు భూమిపై ఆధారపడి వున్నాయి. వీరికితోడు భూమిలేని వ్యవసాయ కూలీలు, కౌలుదార్లు 60 లక్షల మందిని కలిపిచూస్తే, భూసమస్య పరిణామం ఎంత తీవ్రదుస్థితికి వెళ్లుతుందో గోచరమౌతుంది.

1951 వ సం॥ సెన్‌సస్ ప్రకారం 1931 నుండి 1951 సంవత్సరంమధ్య వ్యవసాయంపైబ్రతికే వారి వ్యక్తి దామాషా భూమి సైజు త. 1-కి 54 సెంట్లుకు దిగింది. అంటే 20 సం. లోపల 20 వంతులు పడిపోయింది. ఆధునిక ఆరోగ్య సూత్రాలప్రకారం మద్రాసు రాష్ట్రంలో త. 1-కి కనీసం 1 ఎకరా

సాగయినా వుండాలన్నారు. అంటే మద్రాసు రాష్ట్రంలో ఇవ్వుడు సాగయ్యే 4 కోట్లు ఎకరాలకు ఇంకో రెండు కోట్లు సాగులోకి తెచ్చి- మొత్తం 6 కోట్ల ఎకరాలు సాగయితే ఈ ఆధునిక ఆరోగ్య సూత్రాల స్థాయిని అందుకొంటుంది. (మద్రాసురాష్ట్ర జనాభా 5 కో. 70 లక్షలు) వ్యవసాయం ఈ విధంగా వెనుక ముఖం పట్టితే ఇతర జీవిత ఆధారాలు అంతకన్నా అద్వానంగావున్నాయి. వ్యవసాయంపై జీవించేవారిలో 31-వ వంతు పనిచేస్తే- వారి కష్టంపై ఆధారపడి బ్రతికేవారు దాదాపు 69 వంతులు అని- జీవిత వృత్తుల్లోనూ- యిలానే వుంది. మద్రాసు రాష్ట్రంలోనున్న చేనేత- చేతిపనివారు 40 లక్షలు. వీరిలో పాతిక వంతుకుకూడా పని లేదు. ఇతర పరిశ్రమలపై ఆధారపడి బ్రతకవలసినవారు 70 లక్షలు- వీరిలో సగం మంది నిరుద్యోగులు. వీరితో భూమిలేని లక్షలాది వ్యవసాయ కార్మికులు- కౌలుదార్లు- నోటికి చేతికి అందని బీదరైతాంగమును కలిపిచూస్తే నేటి జీవితభారం, బాధ సులభంగా అర్థమౌతుంది.

యీ పరిస్థితిలోనున్న వ్యవసాయకుల జీవితం దుర్భర బాధలకు గురికాక తప్పుతుందా! యీ విషయంలో కేంద్ర ప్రభుత్వ పరిశీలనలే వ్యవసాయ కూలీల దారిద్ర్యాన్ని గురించి చెప్పుతూ "సంవత్సరానికి సగటున వ్యవసాయకూలీ 155 రోజులు మాత్రమే పనిగలిగివున్నాడు". అని ప్రకటించింది. అంటే ½ సంవత్సరానికి పైబడి అతడికి పనివుండదని అర్థం.

అతడి సంవత్సర కుటుంబ ఆధాయం 444-6-7 రూ.లని, ఖర్చు 615-12-10 రూ.లని, బాకీ 169-6-3 లని లెక్కించారు. ప్రతి 16 వ్యవసాయకూలీ కుటుంబాలలోనూ, 13 కుటుంబాలు శాశ్విత అప్పుల్లో వున్నాయని, వారి సగటు అప్పు కుటుంబం 1-కి 250-0-0 లని, వివరించారు. కుటుంబం అంటే ఒకరు సంపాదించేవారు, ఒకరు సహాయపడేవారు, ముగ్గురు వారిపై ఆధారపడేవారు అని లెక్కించారు. (కేంద్ర ప్రభుత్వ కార్మికవర్గ మంత్రి వర్గ లెక్కలు) యిల్లా రైతాంగంఒకవైపు భూమినికోల్పోయి, కూలీలుగా మారిపోయి- తీరని అప్పులపాలై బ్రతుకు గల్లంతై కూర్చుంటే- రెండవవైపు కొద్దిపాటి భూమివున్న రైతుల పరిస్థితికూడా ప్రమాదకరమైన సంక్షోభస్థాయిని అందుకొంది- సెంట్రల్ బ్యాకింగు కమిటీ లెక్కల ప్రకారం 1931 నాటికే మనదేశ రైతాంగపు అప్పు 900 కోట్ల రూపాయలకు పెరిగింది. రిజర్వుబ్యాంకు అఫ్ ఇండియా అంచనా ప్రకారం ఇప్పుడా మొత్తం 1800 కోట్లకు చేరుకొంది. ఒక్క మదాసురాష్ట్ర రైతాంగపు అప్పు 1948 నాటికే 272 కోట్లు యీ విధంగా వ్యవసాయకులం రెండు వంతులుకూడా లేని భూకామందుల చిట్టాకు 70 వంతుల భూమి దఖలయిపోతే- వున్న భూములు వూడి పోవడమే గాకుండా మనదేశ వ్యవసాయకుల ఖాతాలో 1800 కోట్ల అప్పు నిలిచిపోయింది.

అందువల్ల భూమిలేని వారికి, ఆస్తిలేనివారికి, పనిలేని వారికి ధాన్యోత్పత్తి అధికవ - సంత మాత్రన్నే దరిద్రం

తీరిపోతుందనుకోనడం భ్రమమాత్రమే. వుత్పత్తి పెంపకంతో కూడా-దాన్ని అనుభవించను అందరికి అవకాశములు కలిగించడంద్వారానే అధికోత్పత్తి వుపయోగపడుతుంది.

ఇదంతా చూచిన తర్వాత- ఆస్థిలేనివారిని ఎవరేమి చేయగలరు! అదంతా వారి ఖర్మ! అనే కొన్ని సందేహాలు మనల కలవరపరుస్తున్నాయి. కాని నేటి మన భూసమస్య పరిణామం వెనుక కృత్రిమ మానవ ప్రయత్నం, మోసం మరుగుపడి వుందేగాని, దేవుడో- ఖర్మో- కానేకాదు- మనకు అర్థంకానిదంతా ఖర్మకో- దేవునికో- పాపం! అంటగట్టినా పరిష్కారం మాత్రం గోచరించదు.

## మన పురాతన భూవ్యవస్థ

మన దేశంలో నేడగుపించే అసహజ, అక్రమ భూవిభజన ఎప్పుడూ ఇల్లానే వుండేదా? అని ప్రశ్నించుకుంటే, మన పురాతన వ్యవస్థకూ- నేటి స్థితికి పోలికలే లేవని తేలుతుంది. గతంలో భూమి, నీది-నాదీ అనే సంకుచిత హద్దులకు లోనై వుండేదికాదు. భూమి వ్యక్తిగత ఆస్థిగాగాక, గ్రామస్తులందరియొక్క సమిష్టి సొత్తుగా వుండేది. మొత్తం ఫలితంలో రాజు భాగం క్రింద ప్రభుత్వం కొంతతీసుకొనేది. యుద్ధకాలంలోనో, లేక మరేదయినా ప్రమాదకర పరిస్థితులు కలిగినప్పుడో నాలుగింట ఒక వంతు ప్రభుత్వం పన్నుగా

తీసుకొనేది- సామాన్యంగా పన్నెండింట ఒక వంతు ఫలితాన్ని ప్రభుత్వం పన్ను క్రింద తీసుకొనేది.

లోక ప్రసిద్ధి చెందిన "మను సిద్ధాంతముల"లో యీ విషయమై ప్రస్తావిస్తూ "ప్రకృతినుండి పశుపక్ష్యాదులు ఆహారం పొందినట్లు, రాజుకూడా ప్రజలనుండి పన్నుపుచ్చుకో వచ్చు". బంగారు- పశుసంపద అయినట్లయితే ఐదవవంతు, పంటనుండి పన్నెండవవంతు పన్నుక్రింద తీసుకోవచ్చు. కాని అసాధారణ పరిస్థితులలో క్షత్రియరాజులు నాలుగవవంతు పుచ్చుకొన్నా నిందితులుకారు". అని వ్రాయబడివుంది.

మొగలు పరిపాలనలో సహితం భూమి సమిష్టి ఆస్థిగా పరిగణించి పన్నును మూడవవంతుకు హెచ్చించుకొన్నారు. "భారతదేశ రాజులు గతంలో ఆరవ వంతు పంటను పన్ను క్రింద తీసుకొన్నారు. దానినే ఇప్పుడు- అన్ని పంటలనుండీ మూడవవంతు ప్రభుత్వ పన్నుగా వుండాలని ఘనతవహించిన రాజుగారు శాసిస్తున్నారు" అని అక్బరు శాసనాలలో వుంది.

"ఇంగ్లీషువారి రాకతో యీ వ్యవస్థమారిపోయి, భూమిని వ్యక్తిగత ఆస్థిగా మార్పుచేశారు" అని వ్రాశారు శ్రీ రజనీ పామీదత్తు "నేటి భారతదేశం" అన్న తన ప్రసిద్ధ గ్రంథంలో పరప్రభువుల పరిపాలనలో భారతదేశ సామాజిక వ్యవస్థ తల్లక్రిందులు చేయబడింది. సాంప్రదాయ సిద్ధమైన రాజుభాగం, లేక పంటలో ప్రభుత్వభాగంగావుండిన పద్ధతినుండి, భూమిపన్ను ప్రవేశపెట్టబడింది. అంటే గ్రామ

సమిష్టి సొత్తుగా వున్న భూమిని, ఛిన్నాభిన్నంచేసి- దానిపై కొంత మందికి పెత్తనమిచ్చి- వారినుండి భూమిశిస్తు వసూలు పద్ధతి ప్రవేశపెట్టారు. ఇట్టి శిస్తు వసూలుదార్లు భూస్వాములైతే, రైతులు కౌలుదార్లుగా మారిపోయ్యారు. దీని నుండే భూమి అమ్ముకొనే హక్కు ఏర్పడి- భూమి వ్యక్తిగత ఆస్తిగా మారిపోయి, శిస్తు కట్టలేని వారి నుండి భూములు జప్తులు చేయడం, భూమినుండి వ్యవసాయకుల గెంటివేయడం అములులోకి వచ్చింది.

గతంలో అప్పుల గాథ అంటూ రైతుకుండేదిగాదు. ఉండినా అప్రధాన విషయంగావుండేది. ఎందువల్లనంటే- భూమి వ్యక్తిగత ఆస్తికాదు, కావున అప్పులకు రైతు భూమిని కోల్పోవడమంటూ జరగనేరదుగదా! రైతుకు అప్పు కావలసి వచ్చినా- లేక అతడికి ఇవ్వవలసివచ్చినా, కేవలం అతడి స్వశక్తిపై ఆధారపడి ఇవ్వవలసిందే- నిజానికి ఆ రోజుల్లో వడ్డీవ్యాపారం అస్థిరమైన లాభసాటి కాని బేరంగావుండేది. ''వ్యక్తిగత నమ్మకంపై రైతుకు అప్పు ఇచ్చేవారు. చట్టం ప్రకారం రైతుభూమిని వడ్డీ వ్యాపారి ముట్టుకొన వీలులేదు. వడ్డీవ్యాపార సంబంధములుకూడా గ్రామ సమిష్టి తీర్పుకు లోబడివుండేవి'' అని వ్యాఖ్యానించారు. శ్రీ ముఖర్జీగారు తన ''ల్యాండు ప్రాబ్లమ్-ఇన్-ఇండియా'' అన్న గ్రంథంలో ఆ నాటి వడ్డీ వ్యాపార సంబంధములను గురించి, ఇంగ్లీషు పరిపాలనలో యీ విధానం అంతమై- పెట్టుబడిదారుకు ఆస్తిని-

కాజేయను హక్కు ఇచ్చి- రైతాంగపు జీవనాధారమైన భూమిని త్యజించవలసిన స్థితికి మన భూసమస్యను తెచ్చారు.

జీవితంలో ఇక ఏదిక్కూ లేక, భూమిపై ఆధారపడి బ్రతుకు వెళ్ళబుచ్చుతున్న గ్రామసీమల వ్యవసాయ కూలీవర్గం ఈ పరిణామంలోనే పెరిగిపోయింది. సంవత్సరంలో సగంకాలం కూడా పనిదొరకని యీ కూలీవర్గం, పస్తులతో, బాధలతో కృంగి, కృశించిపొయ్యే స్థితికి చేరుకుంది. పోనీ పనిదొరికిన సగంరోజుల్లోనైనా సంతృప్తికరమైన రేటు లభిస్తుందా అంటే అదీ మృగ్యం.

— వ్యవసాయకూలీల కూలీ రేటు —

భోజనం లేకుండా డబ్బు —

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సం॥లలో— | 1842 | 1852 | 1862 | 1872 | 1811 | 1822 |
| అణాలలో— | 1 | 1½ | 2 | 3 | 4 | 5½ |
| బియ్యపు ధర రూ 1-కి శేర్లలో | 40 | 30 | 27 | 23 | 15 | 5 |

బియ్యపు ధర 8 వంతులు పెరిగితే కూలీ రేటు 5½ వంతులు మాత్రమే పెరిగింది. నేటి కూలీ రేటు సగటున ఒక్క రూపాయి క్రింద లెక్కించినా నేటి బియ్యపు ధర రూ. 1-కి ఒక్కొక్కప్పుడు ఒక్క శేరుకు కూడా పెరిగిపోయింది.

తమదంటూ ఏమీ లేని గ్రామ కార్మిక వర్గపు జీవితం యిలా కల్లోలపూరితమై పోతే, చాలీచాలని భూమితో

భు_క్తిగడవని రై తాంగం మామూలుగా అనుభవించే కష్టాలు కాక, తరచుగా సంభవిస్తున్న బజారు ధరల వడిదుడుకుల్లో తికమకలై పోతూంది. (రెండు వంతుల ధాన్యముల మినహా)

అస్థిరమైన మార్కెట్టు వుత్పన్నంచేసే గల్లంతు రైతాంగమును, ఎంత తీవ్రమైన సంక్షోభమునకు గురిచేస్తుందో ధరల వ్యత్యాసం పరిశీలిస్తే తెలిసిపోతుంది. మన దేశపు ధాన్యం సగటు విలువ సం॥ 1-కి 1034 కోట్ల రూపాయలని డైరెక్టర్ జనరల్ ఆఫ్ కమర్షియల్ ఇన్‌టలిజన్సు రిపోర్టుల్లో లెక్కించారు. కాని 1933-34 సంవత్సరాలలో యీ విలువ 473 కోట్లకు పడిపోయింది. ఆకస్మికంగా యింత అధ్వాన్నంగా పడిపోయిన ధాన్యపు విలువ లక్షలాది మధ్యతరగతి రైతు కుటుంబాలను చెప్పరాని కష్టాలకు గురిచేసింది. ఇట్టి విలకడలేని నిత్యావసర సరకుల మార్కెట్టు మొత్తం సమాజాన్నే క్లిష్టపరిస్థితులకు నెట్టివేస్తుంది.

ఇట్టి ఘోరదుస్థితినుండి మన భూసమస్య పరిష్కారమై మన వుత్పత్తి పెరిగి- ఆహార కొరత, కరువుకాటకాలు పరిష్కారమవుతుందా? అన్న బాధాకరమైన ప్రశ్న మనల నిత్యం పీడిస్తూంది. మనకు మల్లే ఆహార కొరతలతో వేధించబడిన విదేశాల అనుభవాన్ని అవగాహనచేసుకొని- మన దేశ పరిస్థితుల కనుగుణ్యంగా ఏదో ఒక తీవ్రమయిన మార్పును నేటి వుత్పత్తి విధానంలో ప్రవేశ పెట్టకుండా- తిండికరువు

తీరుతుందనుకొనటం తియ్యని కోరికగా మాత్రమే వుండి పోతుంది.

## చైనా రష్యాల ప్రవృత్తి

"విదర్ ఇండియా" అన్న గ్రంథంలో "మనం పోరాడుతున్నది ఎవరి స్వాతంత్ర్యం కొరకు?" అని ప్రశ్నించుకొన్నారు శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూ, "లక్షలాది అభాగ్య అమాయక ప్రజల నుద్ధరించుట కొరకు, ఇతరులతో సంఘర్షించవలసివస్తే కాంగ్రెసు అట్టి పోరాటమునకు సంశయించడమునేది లేనేలేదు, ఇట్టి ప్రయత్నములో కాంగ్రెసు సర్వనాశనమైపోయినా నేను సంతోషించుతాను" అన్నారని పూజ్యనీయుడైన గాంధీగారు, 1942 బొంబై కాంగ్రెసులో, ప్రకటించారు.

పై వాక్యాలకు వారసులమనుకొనే వారేగదా నేటి మన పరిపాలకులు! అయినప్పుడు 6 సంవత్సరాలకు పైగా సాగిన వారి పరిపాలనలో వారెట్టి తీవ్రమార్పులకూ పూనుకొనలేదెందుకని? ఇప్పుడయినా పరిపాలకవర్గాలు అట్టి పనికి పూనుకొంటాయా, అన్న ప్రశ్నలు వుండనేవున్నాయి. కాని అధికారవర్గాల అభిప్రాయాలు ఎట్టివైనా నేటి మన దేశ భూసమస్యను, తిండికరువు, ఆకలిచావులను పరిష్కరించి-దేశంలో శాంతిని నెలకొల్పను- ప్రభుత్వం తీవ్ర సంస్కరణ

లకు దిగేట్లు చేయడం ప్రజల కర్తవ్యమైవుంది.

అధికోత్పత్తిని సాధించడంలో అమెరికా- ఇంగ్లాండు- జపాను మొదలైన దేశాల పంటస్థాయిని మనం చూచాము. కాని ఆ పంటను అందరికి అందేట్లు చేయడంలో ఆ దేశాలలో ఏ తీవ్ర సంస్కరణా ఇంతవరకు అమలుకు రాలేదు. భూసమ స్యను పరిష్కరించడంలో రష్యా "సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు" స్థాపించడం ఒక ప్రధాన మార్గంగా చేబట్టి బ్రహ్మాండమైన వ్యవసాయాభివృద్ధిని సాధించారు. నవచైనా ప్రభుత్వం "దున్నేవారికే భూమి" అనే ఇంకో తీవ్ర సంస్క రణ ద్వారా- భూసమస్యను పరిష్కరిస్తూంది. ఈ రెండు దేశాలలో వుత్పత్తి పెంపకమేగాకుండా- దాని కొరకు చమ టోడ్చే ప్రజలకు తిండి, శాంతిని కలిగించనుకూడా క్రొత్త మార్గాల ననుసరించారు.

ఆస్థి హక్కులపై అందరికి పెత్తనం వుండేలా- సమాజ సంపదను పునర్విభజించిన ఆ దేశాలవుత్పత్తి స్థాయిని తెలుసు కొందాం. చైనాలో నేడున్న నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడిన తర్వాత మూడు సంవత్సరాలకే వ్యవసాయంలో అచ్చట గొప్ప మార్పును తెచ్చారు. పెద్దపెద్ద భూస్వాముల నుండి 11 కోట్లా 60 లక్షల ఎకరములు స్వాధీనం చేసుకొని భూమిలేని 3 కోట్లా వ్యవసాయపారిశ్రామికులకు పంచిపెట్టారు.

195? వ సంవత్సరం ధాన్యోత్పత్తి 1948 వుత్పత్తితో పోల్చితే 50 వంతులు అధికమయింది. ఈ మూడేండ్లలో నీటి

వసతుల కలిగించను నిర్మించిన ప్రాజక్టుల లెక్క 170 కోట్ల క్యూబిక్ మీటర్లు- అంటే 23 సూయజ్ కెనాల్ల్లంత పొడవు ఈ మూడేండ్లలో 90 లక్షల ఎకరాలను క్రొత్తగా నీటిసాగు క్రిందికి తెచ్చారు. చైనా చరిత్రలో నీటివసతుల కొరకై ఎక్కువగా ఖర్చుచేసిన సంవత్సరాల ధనం కంటే 52 వంతులు అధికంగా నేటి ప్రభుత్వం ఇరిగేషన్ అభివృద్ధికి ఖర్చుచేసింది. ఈ వ్యవసాయ అభివృద్ధితోపాటు- అందరికి పని, తిండి స్థిరత్వాన్ని కలిగించే బాధ్యతను, ప్రభుత్వం తీసుకొంది. వైద్య, విద్యా, సౌకర్యాలు పెద్దయెత్తున వుచితంగా ప్రజలందరికీ అమర్చుతున్నారు. ("చైనీస్ మంత్లీ'' నుండి లెక్కలు).

1949 నుండి 52-వ సంవత్సరములోపునే చైనాలో నూతన ప్రభుత్వం సాధించిన అభివృద్ధి నిజానికి ఆశ్చర్యం కలిగించుతుంది.

## చైనాలో ప్రధాన వుత్పత్తి పెరుగుదల

(యుద్ధానికి ముందు అధికంగా వుత్పత్తి అయిన సంవత్సరంలో 100 వంతులు అనుకొని- అటుతర్వాత 1949 నాటికి వుత్పత్తి స్థాయిని పోల్చి- 1952 నాటికి ఎన్ని వంతులు పెరిగిందీ యీ క్రింది ఛార్టు తెలుపుతుంది )

| | 1949 | 1952 సం॥లు |
|---|---|---|
| యుద్ధానికి పూర్వం ధాన్యం 100కి | 75 | 109 వంతులు అధికం |
| దూది | 52 | 155 |

| | | |
|---|---|---|
| నూలు | 72 | 144 |
| గుడ్డ | 73 | 161 |
| కాగితం | 90 | 234 |
| ఇనుము | 11 | 104 |
| ఉక్కు | 16 | 155 |
| ఇనుప పరికరాలు | 18 | 167 |
| పెట్రోలు | 38 | 136 |
| బొగ్గు | 45 | 90 |
| విద్యుచ్ఛక్తి | 72 | 115 |

ఈ విధంగా మనకన్నా అధోగతిలోనున్న చైనా- స్వాతంత్ర్యం తర్వాత మూడేండ్లలో ఇంత మహోన్నత అభివృద్ధిని పొంది 1951 కన్నా 1952 నాటికి చైనా ప్రజల కొనుగోలు శక్తిని 25 వంతులకు, సగటు నికర ఆదాయమును 25.6 వంతులకు పెంపొందించింది,

రష్యా వ్యవసాయ విధానం ప్రధానంగా సమిష్టి క్షేత్రాల క్రిందికి మార్చివేశారు. అందువల్ల పెద్ద ఎత్తున యంత్రాల వుపయోగమును, వ్యవసాయాభి వృద్ధికి జోడించ గలిగారు. 1949 నాటికే 12 కోట్ల 20 లక్షల టన్నుల ధాన్యోత్పత్తిని పొందారు. రెండవ యుద్ధానంతరం మూడు కోట్ల 29 లక్షల ఎకరాలను అధికంగా సాగులోకి తేబడింది. మన దేశం యింత పెద్దదయినా- రష్యాకన్నా జనాభా ఎంతో అధికంగావున్నా- మనకన్నా మూడు వంతుల భూమి అధికంగా

అచ్చట వ్యవసాయం క్రిందవుంది. 1952 నాటికి ఆహార ధాన్యాలు యుద్ధకాలపు వుత్పత్తికన్నా 23 వంతులు అధికమైంది. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు వుత్పత్తితో పోల్చితే ధాన్యం 13 వంతులు- పశుసంపద 40 వంతులూ- ఇట్లానే వుత్పత్తి అన్ని రంగాలలోనూ అధికమైపోయింది.

దేశంయొక్క సగటు వుత్పత్తిని పెంచి, లెక్కలలో సగటు ఆదాయం కాగితాలపై పెంచడం కాకుండా- పెరిగిన సంపదను అనుభవంలో అందరికీ చెందేట్లుచేసి, ఆహార సమస్యకు పరిష్కారమార్గాన్ని యీ దేశాలు ప్రపంచం ముందు వుంచడంలో ప్రత్యేకతను బహిర్గతం చేయగలిగాయి. ఇతర దేశ అభివృద్ధి, ఆహార ప్రమాణం- ఆరోగ్య వసతులు, మొదలైనవి, నేటి మన దేశ దౌర్భాగ్య స్థితితో పోల్చినప్పుడు, ఆయా దేశాలలో ప్రజలు, ప్రభుత్వాలు దారిద్ర్యాన్ని పరిష్కరించను అనుసరించిన మార్గాలు పరిశీలించినప్పుడు- మనకు గోచరమయ్యేది ఒకే ఒక విషయం. అన్ని రంగాలలోనూ, ప్రధానంగా ఆహారరంగంలో వుత్పత్తిని పెంచడం తక్షణ అవసరం- అంతేగాకుండా- ఆ వుత్పత్తిని ప్రజలంతా అనుభవించను అన్ని అవకాశాలు వెంటనే కలిగించడం అన్న రెండవ సమస్యను సమన్వయపరచి, తీవ్రమైన సంఘ సంస్కరణను- మార్పును నేటి ఆ స్థితిహక్కుల విధానంలో తీసుకరావలసి వుంది. లేని యెడల సంఘంలో నిత్యం పరుచుకపోతూన్న ఆకటిబాధ, నిరుద్యోగం, అనారోగ్యం, పెరిగి మొత్తం జాతి

పికానానికే ముప్పుతేక తప్పదు. ఎవరైతే శ్రమిస్తారో- ఎవరి చెమటతో తడిసి సంపద పెరుగుతుందో వారికే భుక్తికి లేక పోవడమనే, ఘోర అన్యాయమును మన దేశం ఇక ఎంతో కాలం సహించలేనంత అధికంగా వేధించబడింది. "ఎవరైతే శరీర కష్టంపై బ్రతుకుతారో, బ్రతకడం కొరకు ఎవరైతే నరనరాలనుండి చెమటనుపిండి, అవయవాల కుంది, కష్టించక తప్పదో- అట్టి శ్రామికునికి- తుదకు తన కండల తానే కరిగించి తిని బ్రతుకవలసిన అభాగ్య స్థితి యీలోకంలో ఎలా సంభవించిందో! దీనికి ప్రత్యర్థంగా, హృదయమున్న మనల ఈ కఠోర సత్యము వణకించే విధంగా ఏదీ వణకించలేదు. ఏ శ్రమజీవి శరీరానికి నిజంగా తగినంత తిండి అవసరమో- అది అతడికి దూరమై- ఎవరి దేహానికైతే నిజంలో అంత ఎక్కువ తిండి అక్కరలేదో- అట్టి ధనవంతుడు అధికంగాఅనుభవించడమేగాకుండా, ఇతరులకు వుపయోగపడే భుక్తిపై తిష్ట వేయడం లాంటి అన్యాయం సృష్టిలో ఎలా వుద్భవించిందో!" అన్న శ్రీ లవాయ్‌సర్ గారి ప్రశ్నను పరిష్కరించినప్పుడే ఆహార సమస్య పరిష్కారమవుతుంది. ("లేబర్ - అండ్ - న్యూట్రిషన్" అన్న లవాయ్‌సర్ గారి గ్రంధం నుండి కొటేషన్. వీరు ప్రపంచ ఆరోగ్యశాస్త్ర ప్రవీణుల్లో ప్రథముడు)

## ఆంధ్రలో ఆహార వుత్పత్తి

ఆంధ్ర దేశ విస్తీర్ణం- వివాదరహిత ప్రాంతాలతో కేంద్రపరిభుత్వం విభజించిన విధంగా, మొత్తంభూమి 4 కోట్ల

3 లక్షలా 96 వేలా 987 ఎకరాలని అంచనా వేశారు. ఇందులో సాగవుతున్న భూమి మొత్తం 2 కోట్లా 43 లక్షలా 29 వేలా 193 ఎకరాలు. మొత్తం జనాభా 2 కోట్లా 4 లక్షల 97 వేలా 801 మంది.

మనకున్న భూమిలో 36 వంతులు మాత్రమే ఇప్పుడు సాగులోవుంది. అడవులు, బంజర్లు మిగతా ప్రాంతాన్ని ఆక్రమించివున్నాయి. సాగవుతున్న భూమిలో 32 వంతులు వరి సాగయితే 48 వంతులు మెట్టధాన్యాలక్రింద, 14 వంతులు వేరుశెనగ, మిగిలినది చెరుకు, పొగాకు మొదలైన వ్యాపార పంటల క్రింద వున్నది.

మద్రాసు రాష్ట్రమునుండి ఆంధ్రను ప్రత్యేకించి ఆహార ధాన్యాల వుత్పత్తిని లెక్కిస్తే యీ క్రింది విధంగావుంటుంది.

—బళ్ళారిజిల్లా మొత్తం కలిపిన ఆంధ్రలో ఆహార వుత్పత్తి—
(టన్నులలో)

| బియ్యం | మెట్ట ధాన్యాలు | పప్పు ధాన్యాలు |
|---|---|---|
| 17,98,400 | 13,68,300 | 1,68,000 |

శేషించిన మద్రాసు రాష్ట్రం ఆహార వుత్పత్తి (టన్నులలో)

| బియ్యం | మెట్ట ధాన్యాలు | పప్పు ధాన్యాలు |
|---|---|---|
| 22,51,600 | 10,13,600 | 1,18,500 |

1950-51 వ. సంవత్సరపు ఆహారధాన్యాలను వివాద రహిత ఆంధ్ర ప్రాంతాల నుండి లెక్కిస్తే 18,61,230 టన్నులు

లు బియ్యం, 5,91,400 టన్నుల జొన్నలు, 1,89,650టన్నుల సజ్జలు, 2,34,870 టన్నుల రాగులు, 1,69,370 టన్నుల కొర్రలు మన ఆంధ్ర ప్రాంతంలో పండినవి. అంటే మొత్తం మన ఆహార ధాన్యాల వుత్పత్తి 30,46,520 టన్నులు. యీ వుత్పత్తిని మన జనాభాతో పోల్చుదాము. 1951 ఫిబ్రవరి నాటికి మన జనాభా(శ్రీ మోటూరు సత్యనారాయణగారి లెక్కల ప్రకారం ఆంధ్రపత్రిక ఆగస్టు 9-వ తా. 1953 నుండి) 2 కోట్లా 12 లక్షలా 33 వేలా 347 మంది. ఇందులో 12 సం॥లోపు వయస్సు గలిగిన వారు 70,77,949 అని, పన్నెండేండ్లకు పైబడ్డవారు 1,41,56,898 మంది అని అంచనా వేశారు. కనుపరచిన ఆహార ధాన్యోత్పత్తికి, వున్న జనాభానుపోల్చి- 12 సం॥లోపు వారికి ఆరు ఔన్సులు, అంతకు పైబడిన వారికి పన్నెండు ఔన్సుల వంతున ధాన్యాదులను పంచితే 21 లక్షలా చిల్లర టన్నులూ మనకు సరిపోతవని, 9 లక్షల టన్నులు మిగుల్తుందని, లెక్కించారు. కాని మానవునికి కనీసం కావలసిన సమీకృత ఆహార ప్రమాణ లెక్కల ప్రకారం- త. 1-కి 14 ఔ. చూపించవలసివస్తే మనకు తరుగు తప్పదనేది యీ లెక్కల ప్రకారమే తేలుతుంది.

అయితే ఆంధ్రదేశంలో కావలసినంత నీటివసతి వుంది. యీ నీటిని మన వ్యవసాయమునకు వినియోగించ గలిగితే నీటిసాగు క్రిందికే, ఒక కోటి ఎకరములను సులభంగా తీసుక రావచ్చుననేది అందరూ అంగీకరించే విషయమే. నదీజలాల

వినియోగంవల్ల ఆంధ్రలో 30 లక్షల ఎకరాల లోపుగానే మనం సాగుచేస్తున్నాము. కనీసం మనం ఇంకింత భూమిని నదీజలాల వినియోగం క్రిందికి తీసుకరాగలిగినా ఆంధ్రరాష్ట్ర ఆహార వుత్పత్తి గొప్పగా అభివృద్ధి అవుతుంది.

కాని అధికోత్పత్తి మాత్రమే భారతదేశ ఆహారకొరతను ఎట్లాగయితే తీర్చలేదో- అది ఆంధ్రలో కూడా అంతే. ఈ విషయాన్ని ఈక్రింది లెక్కలు సూక్ష్మంగానైనా తెలుపుతాయి. ఆంధ్రలో 34 లక్షల వ్యవసాయక కుటుంభాలున్నాయి. ఇందులో 29 లక్షల కుటుంభాలు- అంటే 80వం.లు ఒకటిన్నర ఎకరంలోపు భూమి కలిగివుండేవి. వీరికి తోడుగా భూమిలేని లక్షలాది వ్యవసాయకూలీలు, కౌలుదార్లువున్నారు. 250 ఎకరములకు పైబడి భూమి కలిగిన భూకామందులు ఆంధ్రలో 2400 పట్టాదార్లు మాత్రమేనని మద్రాసు ప్రభుత్వలెక్కలు తెలుపుతున్నాయి.

అందువల్ల అధికోత్పత్తికి నదీజలాల వినియోగం, ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పరికరాలు వుపయోగించడం మాత్రమేగాకుండా- వుత్పత్తికి మూలకారణమైన వ్యవసాయ శ్రామికుల ఆహార సమస్యను పరిష్కరించను తీవ్రమైన భూసంస్కరణలను ప్రవేశపెట్టకుండా- ఆంధ్రలో అధికోత్పత్తి మాత్రమే అన్నిటినీ పరిష్కరించుతుందనుకొంటే- అది ఒక బ్రంహాండమైన భ్రమగా మాత్రమే మిగిలిపోతుంది.

సమాప్తం.

